

చందమామ
మెయిల్-ఎ-టాయ్
పథకం

# చందమామ పాఠకులకు ప్రత్యేక కానుక!










A రాబిట్
సైజు : 13.5 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 83-00
అదనం : రూ. 4-80 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 8-30 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

B టెడీ
సైజు : 10.5 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 93-00
అదనం : రూ. 5-35 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 9-30 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

C జంబో
సైజు : 7 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 68-00
అదనం : రూ. 3-90 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 6-80 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

D బౌవౌ
సైజు : 6 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 45-00
అదనం : రూ. 2-60 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 4-50 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

E పాదర్ హేర్
సైజు : 6 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 25-00
అదనం : రూ. 1-45 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 2-50 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

మా తరవాతి సెట్టులో, ఆనంద కుటుంబాన్ని పూర్తిచేయడానికి మామాహేర్, బేబీహేర్ రానున్నాయి!

మీరంటే మాకెంతో అభిమానం. అందుకే మీకోసం ఒక ప్రత్యేక కానుకను ఏర్పాటు చేశాం. మా బొమ్మలను మొట్టమొదట పొందే అవకాశం కూడా మీకే వుంటుంది. మీరు ఆశించే విధంగానే ధరలోనూ ప్రత్యేకరాయితీ వుంటుంది. మీరు పొదుపుచేయడానికి ఇంకొక మార్గం కూడా వున్నది. ఈ బొమ్మలు ఆర్డర్ చేయడం ద్వారా చందమామ చందాలలో రాయితీ పొంద వచ్చు. 12 సంచికలకు 6 రూపాయలు తగ్గింపు! 24 సంచికలకు 15 రూపాయలు తగ్గింపు!







ప్రియమైన చందమామకు,
మీ 'మెయిల్-ఎ-టాయ్' పథకం గురించి చదివాను. బొమ్మల జాబితాను పరిశీలించాను.
దయచేసి వీటిని పంపండి (అవసరమైన వాటిపక్కన ✓ చేయండి).

* రేబిట్ * టెడి * జంబో * బౌ వౌ * ఫాదర్ హేర్

చందమామ చందాదారుగా చేరాలంటే దీనిద్వారా ప్రత్యేక తగ్గింపును కూడా పొందవచ్చని తెలిసింది.
నేను చందమామకు చందా పంపుతున్నాను :

* ఒక సంవత్సరం (36 రూపాయలకు బదులు 30 రూపాయలు)
* రెండు సంవత్సరాలు (72 రూపాయలకు బదులు 57 రూపాయలు)
* క్షమించండి. చందా తగ్గింపుపట్ల ఆసక్తి లేదు.

దీనితోపాటు, చందమామ టాయ్‌ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్ పేరు మీదుగా తీసిన రూ.........పోస్టల్ ఆర్డర్/మనిఆర్డర్ పంపుతున్నాను.




Note : This offer is valid only up to 30-6-1990.

ఒక నెలలోగా బొమ్మ(లు) అందగలద(వ)ని ఆశిస్తున్నాను. ఒకవేళ బొమ్మలు నచ్చకపోతే వాటిని ఒక వారంలోగా తిప్పి పంపితే, ధర పైకాన్ని తిరిగి పొందవచ్చని గ్రహించాను.

నా పేరు : ______________ పుట్టిన తేది : ______________

చిరునామా : ______________

______________

నా అభిమాన విషయం : ______________

పత్రికలు/కామిక్స్ : ______________

టి. వి. కార్యక్రమాలు : ______________ బొమ్మలు ______________

వినోదాలు ______________ : చదవడం/బొమ్మలు/ఆటలు/టీవీ/వీడియో/వీడియో గేమ్స్/ఇంకేమయినా వుంటే రాయండి




మీరు చేయవలసిందల్లా, ఇక్కడి కూపన్‌ను పూర్తిచేసి, మాకు—
చందమామ టాయ్ ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్, చందమామ బిల్డింగ్స్,
**188, ఎన్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు—600 026**
చిరునామాకు పంపడం మాత్రమే. ఈ కూపన్ మాకు చేరిన ఒకనెల లోగా మీకు మా బొమ్మలు అందుతాయి. ఒకవేళ మీకు ఆ బొమ్మలు సంపూర్ణతృప్తిని కలిగించలేదంటే, ఒక వారం లోగా వాటిని మాకు పంపినట్టయితే, ధర మొత్తాన్ని మీకు తిప్పి పంపగలమని హామీ ఇస్తున్నాము.

గమనిక : కూపన్‌లో ఉన్న బొమ్మల జాబితాను పరిశీలించి, వాటిలో మీకు కావలసిన బొమ్మ/బొమ్మలు ఏవో వాటిపక్కన టిక్ (✓) మార్క్ చేసి సూచించండి. తరవాత, మీ పూర్తి చిరునామాను స్పష్టంగా రాసి, బొమ్మ(ల) ధరను పోస్టల్ ఆర్డర్ ద్వారా పంపుతున్నారో, మని ఆర్డర్ ద్వారా పంపుతున్నారో తెలియజేయండి. దయచేసి బొమ్మల సరైన ధరను పంపండి. మీ ఆర్డర్లను పరిశీలించి, పంపడంలో చిక్కులు రాకుండా వుండడానికే ఈ సూచన. ఈ ముఖ్య అంశాలను స్పష్టం చేయకుండా కూపన్లను పంపినవారు, మళ్ళీ విడిగా ఈ వివరాలను మాకు తెలియజేయాలి. అప్పుడే వారికి త్వరగా బొమ్మ(లు) పంపడం సాధ్యమవుతుంది.







Manufactured in technical collaboration with
Sammo Corporation, South Korea.

**చందమామ టాయ్‌ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్**
**'చందమామ బిల్డింగ్స్'**
**188, ఎన్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు – 600 026**



Mudra:M:CT:3789

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'  సంచాలకుడు : నాగిరెడ్డి

## బాలల పుస్తకాలు

పెరిగిపోతూన్న పుస్తకాల ధరల గురించి, పాఠకుల నుంచి మాకు రోజూ ఉత్తరాలు వస్తున్నాయి. పిల్లలకని ఉద్దేశించిన పుస్తకాల ధరలు కూడా రోజురోజుకూ అదుపు లేకుండా పెరిగిపోతూ వున్నాయి.

కొన్ని సంవత్సరాలుగా పుస్తక ప్రచురణకు సంబంధించిన వస్తువులధరలూ, కాగితంధరా విపరీతంగా పెరిగిపోవడంతో, పుస్తకాల ధరలు సగటు పౌరులు అందుకోలేని స్థాయికి చేరుకున్నాయి.

అయితే, ఇవాళ మన బాలబాలికలలో పఠనాసక్తిని పెంపొందించడం ఎంతయినా అవసరం. ఎందుకంటే, ఇటీవల టీవీలు చూడడం ఎక్కువై, చదువు పట్ల ఆసక్తి తగ్గుతున్నది. అయినా, బాలబాలికల మనోవికాసానికి—పుస్తకపఠనానికి మించిన మార్గం మరొకటి లేదని నిపుణులు అభిప్రాయపడుతున్నారు. కాబట్టి పుస్తక పఠనం, ముఖ్యంగా మంచి పుస్తకాలు చదవడం—బుద్ధివికాసానికీ, జీవిత అవగాహనకూ తప్పక సహాయకారి అవుతుంది.

మంచిపుస్తకాలను అందరికీ అందుబాటులోని ధరలకు అందజేసే మార్గాన్ని ఎలాగైనా కనుగొనవలసిందిగా ప్రభుత్వాన్నీ, ప్రచురణకర్తలనూ కోరుతున్నాం. కనీసం మంచి పిల్లల పుస్తకాలను ఎన్నుకుని, వాటిని సరసమైన ధరలకు అందజేయవచ్చు!

సంపుటి 86  మార్చి '90  సంచిక 3

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00








Stick **He-Man** in your favourite nook



And **Zodac** on a colourful ball





Put **Skeletor** on a much loved book

And **Teela** on your bedroom wall



Watch **Orko** laughing on your school bag



And plaster **Evil-Lynn** on your favourite mag.

FREE! A HE-MAN STICKER WITH EVERY TRUE WAFER




Begin your He-Man Collection now. With a bite.

Choose from the TRUE range of wafers. In four delicious flavours.

- Orange
- Pineapple
- Chocolate
- Elaichi

And watch your collection grow. Bite after bite.

TRUE

Biscuits, Vermicelli and Wafers – Made with the best ingredients, love and care.

AFL 15 89

# తూర్పు యూరపులో జరుగుతున్నదేమిటి?

అల్బేనియా, బల్గేరియా, జెకొస్లొవేకియా, హంగేరి, పోలండు, రుమేనియా, యుగొస్లేవియా మొదలైన దేశాలను తూర్పు యూరపు దేశాలు అని అంటారు. కొన్ని సందర్భాలలో జర్మన్ డెమొక్రటిక్ రిపబ్లిక్, సోవియట్ రష్యాలోని కొంత భాగం కూడా ఈ జాబితాలోకి వస్తాయి.

రెండవ ప్రపంచయుద్ధ సమయంలో జర్మని, నియంత హిట్లర్ నాయకత్వంలోనూ, ఇటలీ, ముసోలినీ నాయకత్వంలోనూ—ఒకటిగా కలిసి తూర్పు యూరపు దేశాలను జయించాయి. ఆఖరికి జర్మనీ ఓడిపోవడంతో, దానిని జయించిన మిత్ర పక్షాలు ఈ దేశాలకు స్వతంత్రం కలిగించాయి. పేరుకు స్వతంత్ర దేశాలయ్యాయి గాని, నిజానికి అవి, సోవియట్ రష్యా కమ్యూనిస్టు నియంత స్టాలిన్ ఏర్పరచిన ప్రభుత్వాల ఆధీనంలోకి వచ్చాయి. ఈ కొత్తపాలకులందరూ కమ్యూనిస్టులే. అందరూ స్టాలిన్‌కు విధేయులై, విశ్వాసపాత్రు లయ్యారు.

అయితే, యుగొస్లేవియా నాయకుడు, మార్షల్ టిటో సోవియట్ అధికారాన్ని సహించలేక స్టాలిన్‌ను తోసిరాజని స్వతంత్ర మార్గం అను సరించాడు. మిగతా వాళ్ళందరూ, స్టాలిన్ మరణానంతరం కూడా, సోవియట్ నాయకులకు విధేయులుగానే కొనసాగారు. అయితే పాలకు లకు వ్యతిరేకంగా ఎప్పుడయినా తిరుగుబాటు తలెత్తినట్టయితే, దారుణంగా అణచివేయ సాగారు. కొన్ని సమయాలలో రష్యాసేనలు వారికి సహాయంగా వెళ్ళేవి. ప్రభుత్వాలలో కమ్యూనిస్టు పార్టీకి తప్ప మరొకపార్టీకి నిర్ణయాలు తీసుకునే అధికారం లేదు!

ఈ పరిస్థితి రెండు అనర్థాలకు దారి తీసింది. ఒకటి, ప్రజలు తమ అభిప్రాయాలను స్వతం త్రంగా వెలిబుచ్చలేక పోయారు. రెండు, కమ్యూనిస్టు పార్టీ పేరుతో కొందరు వ్యక్తులు ప్రభుత్వాలపై తమ ఇష్టానుసారం అధికారాన్ని చెలాయించసాగారు. రుమేనియా నియంత నికొలాయ్ చుసెస్క్యూను ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు. అతడొక చక్రవర్తిలా ఆడంబర జీవితం సాగిస్తూ, పిచ్చివాడిలా అంతులేని సంపద లను సమకూర్చుకుంటూ, ఎవరైనా వ్యతిరేకిస్తే,

అణచివేస్తూ, హతమారుస్తూ తన అధికారాన్ని సాగించాడు. పెల్లుబికిన ప్రజల తిరుగుబాటు గత డిసెంబర్ 25 న, అతని పాలనను అంతం చేసి, అతని ప్రాణాలు కూడా తీసింది. ఒకే పార్టీ పాలననూ, ఒక కుటుంబం పాలననూ, అనుభవించిన రుమేనియా ఈనాడు ప్రజాస్వామ్య మార్గంలో పయనించనున్నది.

మిగతా తూర్పు యూరపు దేశాలలోనూ ఇదే ధోరణి కనిపిస్తున్నది. ఏక పార్టీ పాలనకు స్వస్తి చెప్పి ప్రజలు ప్రజాస్వామ్యం కోసం ఉవ్విళ్ళూరుతున్నారు.

ఈ ధోరణి కంతటికీ ప్రేరణ కలిగించింది— ఇటీవల సోవియట్ రష్యాలో వచ్చిన మార్పు. మిఖైల్ గోర్బచేవ్ నాయకత్వంలో సోవియట్ రష్యా చాలా ఉదార సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నది. ప్రజలు తమ భావాలనూ, అభిప్రాయాలనూ స్వతంత్రంగా వెలిబుచ్చడానికి ఇది దోహదం చేస్తున్నది.

ఈ సంఘటనల ద్వారా, కమ్యూనిస్టు పార్టీలు ప్రబోధించిన సోషలిజం, సమసమాజం అర్థ రహితమయ్యాయన్న నిర్ణయానికి రాకూడదు. అయితే, ఈనాడు ప్రపంచవ్యాప్తంగా విజ్ఞులైన ప్రజలందరూ, సోషలిజాన్ని ప్రజాస్వామ్యం ద్వారా సాధించవచ్చని గ్రహించారు.





# నికుంభుడి గర్వభంగం

నికుంభుడు అనే పండితుడు దేశదేశాలు సంచరిస్తూ, అక్కడి పండితులను తన పాండిత్యంతో ఓడించసాగాడు. ఆ కారణంగా అతడిలో, తనను మించిన పండితుడు లేడన్న అహం పెరిగింది.

ఒకసారి నికుంభుడు అలా దేశాలు తిరుగుతూ, సౌశీల్యదేశ రాజధాని అయిన మలయావతీనగరం చేరాడు. రాజు సర్వోత్తముడు, నికుంభుడిని ఆహ్వానించి, అతడు వచ్చినపని తెలుసుకుని, ఒక రోజున నిండుసభలో ఆస్థానపండితులతో వాదనకు తగిన ఏర్పాట్లు చేయించాడు.

ఆస్థానపండితులు ఎటువంటి క్లిష్ట సమస్యలను యిచ్చినా, నికుంభుడు క్షణంలో సమాధానాలు చెప్పసాగాడు. అయితే, నికుంభుడు అడిగిన ప్రశ్నలకు మాత్రం ఆస్థానపండితులు సమాధానాలు చెప్పలేక దిక్కులు చూడసాగారు.

రాజు సర్వోత్తముడి ఆస్థానంలో గొప్ప పండితులున్నారన్న ఖ్యాతి వుండేది. అటువంటి పండితులను, తను ఓడించగలిగితే, ఇక తనను మించిన పండితుడు వుండడన్న విషయం స్ఫురించేసరికి, నికుంభుడు ఆనందం పట్టలేకపోయాడు.

కొంతసేపటికి ఆస్థానపండితులు, తమ ఓటమిని అంగీకరించారు. నికుంభుడు తన ఆసనంలో నుంచి దిగ్గున లేచి, రాజుతో, "ప్రభూ, నా చేతిలో మీ పండితులందరూ చిత్తుగా ఓడిపోయారు. నాకు మీ సన్మానాలూ, సత్కారాలూ అవసరం లేదు. మీ పండితులను నా గొప్పతనం అంగీకరించి, పాదాభివందనం చెయ్యమనండి చాలు!" అన్నాడు.

రాజు సర్వోత్తముడికి ఇది గొప్ప అవమానంగా తోచి, ఏమిచేయడమా అని ఆలోచిస్తున్నంతలో, జనంలో నుంచి ఒక

దాసరి వెంకటరమణ



వ్యక్తి సభమధ్యకు వచ్చి, రాజుకు నమస్కరించి, "ప్రభూ, నా పేరు ధరహాసుడు. మీరు అనుమతించినట్ట యితే, ఈ పండితుణ్ణి నేను కొన్ని ప్రశ్నలు అడుగుతాను," అన్నాడు.

రాజు అందుకు అంగీకరించాడు. పొడుగ్గా బక్కపలచగా వున్న ధరహాసుడి వంక చూస్తూ, నికుంభుడు నవ్వాడు.

ధరహాసుడు, నికుంభుడితో, "ఆర్యా, తమరు మహాపండితులు. తమవంటి మేధావుల ప్రశ్నలకు సమాధానం చెప్పే పాటి జ్ఞానం పామరుడనైన నాకు లేదు. నేనే మిమ్మల్ని రెండు ప్రశ్నలడుగుతాను. వాటికి మీరు సమాధానం చెప్పగలిగితే, నేను ఓటమిని ఒప్పుకుంటాను. అలా కానప్పుడు, మీరు మీ ఓటమిని అంగీకరించి మారు పలకకుండా సభనుంచి వెళ్ళిపోవాలి." అన్నాడు.

నికుంభుడు అందుకు సరేనని, "ఆ ప్రశ్నలేమిటో త్వరగా అడుగు," అన్నాడు.

"వినండి! మూడు మేకలు వరుసగా, ఒక కాలిబాట వెంట వెళుతున్నాయి. ఒక మనిషి వాటికి ఎదురై, ముందున్న దాన్ని, "నీ వెనక ఎన్ని మేకలు వస్తు న్నాయి?" అని అడిగాడు. దానికి ఆ మేక, "రెండు," అన్నది. ఆ మనిషి ముందుకు నడిచి రెండవ మేకను కూడా అదే ప్రశ్న వేశాడు. ఆ మేక కూడా రెండు అనే సమాధానం చెప్పింది. అదెలా సంభవం ఆ మేక అలా ఎందుకు చెప్పింది? ఇది నా మొదటి ప్రశ్న," అన్నాడు ధరహాసుడు.

నికుంభుడు పెద్దగా నవ్వి, "ఇదేం ప్రశ్న?" అన్నాడు హేళనగా.

"నేను ముందే చెప్పాగదా, పామరుడ నని. పామరుడి ప్రశ్నలకూడా సమా ధానం చెప్పలేని తమరేం పండితులు?" అన్నాడు ధరహాసుడు.

నికుంభుడు కొంచెంసేపు ఆలోచించి, "ఆ మేకలు వలయాకారంలో తిరుగుతూ వుండి వుండాలి. అప్పుడు రెండో మేక

వెనక కూడా, రెండు మేకలు రావడానికి అవకాశమున్నది." అన్నాడు.

ధరహాసుడు చిన్నగా నవ్వి, "కాదు. అవి వరుసగా ఒక కాలిబాట వెంట వెళు తున్నవని ముందే చెప్పాను," అన్నాడు.

దానితో నికుంభుడు ఆలోచనలో పడ్డాడు. ఎంత ఆలోచించినా అతడికి మరొక సమాధానం తోచలేదు. చేసేదిలేక ధరహాసుణ్ణే సమాధానం చెప్పమన్నాడు.

"ఆ రెండవ మేక అబద్ధాలు చెప్పే మేక. అందువల్లనే, అది అలా చెప్పింది," అన్నాడు ధరహాసుడు.

సభలో వున్నవాళ్ళందరూ పెద్దగా నవ్వి, ధరహాసుణ్ణి మెచ్చుకుంటున్నట్టు చూశారు. నికుంభుడు తన ఓటమిని ఒప్పు కుంటూ, "సరే, నీ రెండో ప్రశ్న ఏమిటి?" అని అడిగాడు.

"ఒక మనిషి ఒక కొండమీద నిలబడి, సూర్యుడికేసి సూటిగా కొద్ది క్షణాలు చూసి, తర్వాత కొండ దిగి తూర్పుదిశగా నాలుగు క్రోసులదూరం నడిచాడు. అక్కడినుంచి కుడివైపుగా తిరిగి అయిదు క్రోసులదూరం నడిచాడు. అక్కడినుంచి ఎడమవైపుగా తిరిగి, సరిగ్గా రెండుక్రోసులదూరం నడిచి, ఠక్కున ఆగిపోయాడు. ఆ మనిషి ఎందుకలా ఆగిపోయాడు? ఇది నా రెండవ ప్రశ్న." అన్నాడు ధరహాసుడు.



నికుంభుడు, ధరహాసుడి వంక పిచ్చి వాణ్ణి చూసినట్టుగా చూసి, అయినా ఏదో ఒక సమాధానం చెప్పాలి గనక, "వాడికి సముద్రం అడ్డొచ్చి వుంటుంది," అన్నాడు.

"కాదు!" అన్నాడు ధరహాసుడు.

ఆ మనిషి అలా ఆగిపోవడానికి, కారణాలు ఏమై వుంటాయని ఆలోచించి, నాలుగైదు కారణాలు చెప్పాడు నికుంభుడు. అవేవీ కాదన్నాడు ధరహాసుడు. ఎంత ఆలోచించినా సరైన సమాధాన మేమిటో, నికుంభుడికి తట్టలేదు.

చేసేదిలేక చివరికి తన ఓటమిని ఒప్పు కుని, నికుంభుడు, "పోనీ, నువ్వే చెప్పు.

ఆ మనిషి ఎందుకు ఆగిపొయ్యాడు?'' అని అడిగాడు.

''అది వాడి ఇష్టం! ఆగిపోవాలనుకున్నాడు; ఆగిపొయ్యాడు, అంతే!'' అన్నాడు ధరహాసుడు.

నికుంభుడి ముఖం వెలవెలపోయింది. సభలో వున్నవాళ్ళందరూ హర్షధ్వానాలు చేశారు. రాజు ప్రశంసాపూర్వకంగా ధరహాసుడి కేసి చూశాడు.

తల పంకిస్తూ నేలచూపులు చూస్తున్న నికుంభుడితో, ధరహాసుడు, ''మీరు గొప్ప పండితులు కావచ్చునేమోగాని, జ్ఞాన సంపన్నులు మాత్రం కాదు. జ్ఞానానికి అంతన్నది లేదు గదా! అయినా జ్ఞానవంతుల మనుకునే కొందరు—ఎవరైనా ఒక వ్యక్తి పిడికిటినిండా ఇసుక పట్టుకుని, ఇందులో ఎంత ఇసుక వున్నదని అడిగితే, లెక్కపెట్టడం కష్టమని చెబుతారేగాని, అందులో పిడికెడు ఇసుక వున్నదని మాత్రం సూటిగా చెప్పరు. మీరు అలాంటి వారి కోవకు చెందినవారే,'' అన్నాడు.

ఇది వింటూనే నికుంభుడు, రాజుతోగానీ, ధరహాసుడితోగానీ ఒక్క మాట మాట్లాడకుండా సభలో నుంచి మౌనంగా వెళ్ళిపోయాడు.

రాజు సర్వోత్తముడు, ధరహాసుణ్ణి దగ్గిరకు పిలిచి వివరాలు అడిగాడు.

ధరహాసుడు వినయంగా, ''ప్రభూ, మాది సమీపంలో వున్న మృణాళినీ నదీతీరంలోని చిన్న అగ్రహారం. మా తండ్రికి మేము ముగ్గురం కొడుకులం. మేము గొప్ప పండితులం కాదుగాని, మాది పండిత కుటుంబమే,'' అంటూ దూరంగా వున్న తన సోదరులను చూపుతూ, ''మా తమ్ముడి పేరు మందహాసుడు, మా అన్న పేరు అట్టహాసుడు. మేం ముగ్గురం తమ కొలువులో ఏదైనా ఉద్యోగం దొరుకుతుందేమో అని వచ్చాము,'' అన్నాడు.

సర్వోత్తముడు, ధరహాసుణ్ణి ఘనంగా సత్కరించి, అతడితోపాటు అతడి అన్నకూ, తమ్ముడికి కూడా, ఆస్థానంలో తగిన ఉద్యోగాలు యిచ్చాడు.





# హరిదాసు బుద్ధి

సీతాపురం గ్రామంలో, కామాక్షయ్య అనే ఒక హరిదాసుండే వాడు. ఆయన చెప్పే కథలకు శ్రీహరి, గణపతి, చంద్రం అనే వాళ్ళు పక్కవాయిద్యాలతో, వంతపాటతో బాగా రక్తికట్టిస్తూండేవాళ్ళు.

కామాక్షయ్య కథ చెప్పేందుకు నూట పదహార్లు తీసుకునేవాడు. ఆ పైన వినే వాళ్ళల్లో కొందరు, ఆయన చెప్పిన హరి కథకు సంతోషించి కొంతడబ్బు యిస్తూండే వాళ్ళు. కథ పూర్తవగానే, హారతిపళ్ళెంలో వేసిన డబ్బు కూడా కామాక్షయ్యే తీసుకునే వాడు. అయితే, ఆ విధంగా వచ్చిన మొత్తం డబ్బులో, బహుతక్కువ డబ్బును శ్రీహరికీ, గణపతికీ, చంద్రానికీ ఇస్తూండే వాడు. వాళ్ళకు ఆ డబ్బు తీసుకోవడం అసంతృప్తికరంగా వున్నప్పటికీ, హరి దాసుకు కోపం వస్తుందని మారుమాట్లాడే వాళ్ళు కాదు.

ఒకసారి ఆ ముగ్గురూ, కామాక్షయ్య లేని సమయంలో ఆయన ఇంటికి వెళ్ళి, హరిదాసు భార్య అచ్యుతాంబతో ఎంతో దీనంగా, ''అమ్మా, హరిదాసుగారిని అందరూ చాలా గొప్పగా మెచ్చుకుంటే— ఆయన ఆ ఘనతకథ చెప్పే తన ఒక్కడిదే కాదనీ, అందులో మా ముగ్గురికీ పాలువున్నదనీ, నలుగురితో అనడమే గాని, వసూలైన డబ్బులో కొద్దిగా మాత్రమే మాకు ఇస్తున్నాడు. కుటుంబీకులమైన మాకూ అనునిత్యం ఎన్నో సాధకబాధకాలుంటవి,'' అన్నారు.

హరిదాసు భార్య అంతా విని, వాళ్ళతో, ''మీరు చెప్పకుండానే హరిదాసుగారు, మీతో ఎలా ప్రవర్తిస్తున్నదీ నేను గమనిస్తూనే వున్నాను. ఆయనకు నచ్చని మాట ఏదైనా చెబితే, తీవ్రంగా కోపగించుకుంటాడు,'' అన్నది.

ఆరుపల్లి గోవిందరాజులు



రక్తికట్టడానికి వాళ్ళసాయం చాలా వున్న దని, అందరితో చెపుతుంటారు! మరి మీకు వచ్చే డబ్బులో, వాళ్ళకూ న్యాయమైన భాగం యివ్వవచ్చు గదా,'' అన్నది.

ఆ మాటలకు హరిదాసు కోపంగా, ''ఈ న్యాయాన్యాయాల సంగతి, నాకు తెలయంది కాదు. ఇకముందు వాళ్ళను గురించిన ప్రసక్తి, నాదగ్గిర తేకు,'' అన్నాడు.

కొంతకాలం జరిగింది. హరిదాసు తన కుమార్తెకు యోగ్యుడైనవాడితో, ఘనంగా వివాహం జరిపించాడు. ఆ తరవాత కొంత మాగాణి పొలం కొనుక్కున్నాడు. అయినా, ఎన్నో ఏళ్ళుగా తన వెంట వుంటున్న వాయిద్యగాళ్ళకు డబ్బు యివ్వడంలో పిసినారితనం చూపిస్తూనే వున్నాడు. ఇక సహించలేక శ్రీహరీ, గణపతీ, చంద్రం హరిదాసు ఇంటికేసి వెళ్ళడం మానుకున్నారు.

ఏం జరిగివుంటుందో తెలుసుకుందామని, ఒకనాడు కామాక్షయ్య ముందుగా శ్రీహరి ఇంటికి వెళ్ళాడు. ఆయననుచూసిన శ్రీహరి భార్య ఆశ్చర్యపోయి, ''తమరు ఇటు వచ్చి చాలా కాలమైంది. మా ఆయన, మీ హరికథల గొడవలో పడి కుటుంబ విషయాలే అసలు పట్టించుకోవడంలేదు. మా అమ్మాయికి పెళ్ళీడు దాటిపోతున్నది. మరింత అలస్యం జరక్కుండా, ఎక్కడైనా మంచి సంబంధం

''అమ్మా, ఆ సంగతి మేమూ ఎరిగినదే. ఎంతో కాలంగా వారినే నమ్ముకుని వారి వెంట తిరుగుతూ సేవ చేస్తున్నాం. ఇప్పుడు ఈ వయసులో, ఈ వృత్తిని మాని ఏ కాయకష్టమో చేసుకుని బతకలేం కదా,'' అన్నారు శ్రీహరి, గణపతి, చంద్రం.

హరిదాసు భార్య కొంచెంసేపు ఆలోచించి, ''సరే, వీలుపడినప్పుడు నేను, వారితో మిమ్మల్ని గురించి చెబుతాను. ఊరికే మనసును కలత పెట్టుకోకండి,'' అన్నది.

ఆ రోజు హరిదాసు ఇంటికి రాగానే అచ్యుతాంబ, ఆయనతో, వాయిద్యగాళ్ళ గురించి చెప్పి, ''మీరు చెప్పే కథలు

చూసుకోవాలి," అంటూ తమ కుటుంబ సమస్యల గురించి హరిదాసుకు చెప్పు కున్నది.

అంతా విని కామాక్షయ్య, అక్కడి నుంచి గణపతి ఇంటికి వెళ్ళాడు. గణపతి భార్య జబ్బుతో మంచంలో వున్నది. గణపతి పదిహేనేళ్ళ కొడుకు ఆయనతో, "మా నాన్న అశ్రద్ధ వల్ల, మా అమ్మకు జబ్బు నయం కాకుండా వున్నది. మంచి వైద్యుడి చేత వైద్యం చేయించడానికి మా దగ్గర డబ్బు లేదు. పోరగా, పోరగా ఎవరిదగ్గిరైనా అప్పు దొరికితే తెస్తానంటూ ఇప్పుడే మానాన్న గ్రామంలోకి వెళ్ళాడు," అన్నాడు.

కామాక్షయ్య, మంచంలో వున్న గణపతి భార్యను పలకరించి, జబ్బేమిటో తెలుసు కుని, అక్కడి నుంచి సరాసరి చంద్రం ఇంటికి వెళ్ళాడు.

చంద్రం ఇంటి అరుగు మీద ఒక చాప వేసుకుని దిగులుగా కూర్చుని వున్నాడు.

కామాక్షయ్య పలకరించగానే, "అయ్యా, నా అసమర్థత, అశ్రద్ధల కారణంగా, ఇలా పేదరికం అనుభ విస్తున్నాను. కూటికీ, గుడ్డకూ చాలని సంపాదనతో, నా భార్యాబిడ్డలకు సుఖం అనేది లేకుండా చేశాను. ఇకనుంచి తమ వెంట తిరగలేను. పెద్దవాణ్ణయిపోయాను. ఓపిక సన్నగిల్లింది," అన్నాడు.

"అలాగా!" అంటూ కామాక్షయ్య చిన్నగా నవ్వి, ఇంటికి పోయి, వెంటనే వాళ్ళ ముగ్గురినీ పిలిపించి, ఊరిపెద్దల



సమక్షంలో, వాళ్ళు తనను గురించి ఏమను కుంటున్నదీ నిర్భయంగా చెప్పమన్నాడు.

హరిదాసంటే విసిగిపోయి, తెగింపుతో వున్న శ్రీహరీ, గణపతీ, చంద్రం— ఆయన పిసినిగొట్టూ, ధనాశాపరుడూ అంటూ నిర్మొహమాటంగా చెప్పేశారు.

అప్పుడు కామాక్షయ్య, ఇంట్లో నుంచి మూడు సంచుల్లో డబ్బు తెచ్చి వాళ్ళ ముందు పెట్టి, "మీరు నన్ను అపార్థం చేసుకునేందుకు తగిన కారణాలేవున్నవి. కాని, నేను మీ మేలుకోసమే, ఇవ్వ దలచిన డబ్బులో సగం మీకిస్తూ, సగం నా దగ్గిర దాచాను. మీలో నాకున్న నిగ్రహ శక్తిలాంటిది లేదు. లోగడే ఈ డబ్బు యిచ్చివుంటే దుబారాగా ఖర్చు చేసి, వయసు మీరాక ఏపనీ సక్రమంగా చేయ లేక అవస్థలపాలై వుండేవారు," అన్నాడు.

"అయ్యా, ఆ మాటా నిజమే," అన్నాడు శ్రీహరి.

కామాక్షయ్య ముగ్గురికీ డబ్బు సంచు లిచ్చి, "మీకు ఒక్కొక్కరికి పదివేల రూపాయలిస్తున్నాను. చంద్రం అన్నట్టు, అతడే కాదు మనం నలుగురం పెద్దవాళ్ళమై పోయాము. లోగడలా ఇప్పుడు ఊళ్ళు తిరగలేం. ఇకనుంచి ఇళ్ళపట్టున వుండి విశ్రాంతి తీసుకుందాం. నేనిచ్చిన డబ్బుతో మీమీ గృహ సమస్యలు తీరే పూర్తి అవకాశం వున్నది. ఒకవేళ అవసరం కలిగితే, నా దగ్గిరకు రండి. తప్పక చేతనైన సహాయం చేయగలను," అని చెప్పాడు.

శ్రీహరీ, గణపతీ, చంద్రం కృతజ్ఞతతో హరిదాసు పాదాలంటి నమస్కరించి, "అయ్యా, మావల్ల జరిగిన తప్పులేమైనా వుంటే, క్షమించండి!" అన్నారు.

హరిదాసు ఏదో అనబోతున్నంతలో, ఒక గ్రామపెద్ద, "ఇందులో ఒకరినొకరు క్షమించవలసిందేమీ లేదు. మీమేలు కోరి కామాక్షయ్యగారు కొంత కాలంపాటు, మీ దృష్టిలో పిసినారి అయ్యాడు," అన్నాడు.

అందుకు హరిదాసుతోపాటు, అక్కడ వున్నవాళ్ళందరూ పెద్దగా నవ్వారు.






## 7

[సుమేధరాజ్య సింహాసనాన్ని కుట్రతో ఆక్రమించుకున్న సేనాధిపతి వీరసింహుడి దురాగతాలు మితిమించిపోయాయి. తన అధికారాన్ని అంగీకరించని వృద్ధమంత్రినీ, తన భటులకు ఎదురు తిరిగిన వసంతుడనే యువకుణ్ణీ హతమార్చడానికి వీరసింహుడు పథకం వేశాడు. కాని, సమయానికి ముసుగు వీరుడొకడు వచ్చి ఆ ఇద్దరినీ ప్రాణాలతో రక్షించాడు.—తరవాత]

ధర్మవీరుడి సహాయంతో, వసంతుడు కొత్వాలు నుంచి తప్పించుకున్నాడన్న వార్త వినగానే, వీరసింహుడు ఆగ్రహావేశంతో వణికిపోయాడు.

"మీ సమక్షానికి వచ్చి, ముఖం చూపడానికి కొత్వాలు సిగ్గుపడుతున్నాడు ప్రభూ!" అన్నాడు చిన్నకొత్వాలు వీరసింహుడి దగ్గరికి వచ్చి భయంతో చేతులు జోడిస్తూ.

కొత్వాలు, వీరసింహుడితో చేతులు కలిపి, శాంతిదేవుడిపట్ల విశ్వాసఘాతుకంగా ప్రవర్తించాడు. కొత్తగా అధికారాన్ని చేపట్టిన వీరసింహుడి అడుగులకు మడుగులొత్తుతూ, అతనిదయకు పాత్రుడయ్యాడు. ఆ కారణంగా వీరసింహుడు క్షమించి, తనను రమ్మని కబురు చేయగలడన్న ఆశతో, అతడు చిన్నకొత్వాలను దూతగా పంపాడు.



అయితే, వీరసింహుడు ఆ మాటలకు మండిపడి, "ఆ చేతకాని దద్దమ్మ ముఖం చూడాలని మాకు లేదు. వెంటనే వాణ్ణి రాజ్యం వదిలి పొమ్మని చెప్పు. ఈ క్షణం నుంచి నిన్ను మా కొత్వాలుగా నియమిస్తున్నాం!" అన్నాడు.

చిన్న కొత్వాలుకు పట్టరాని సంతోషంతో ఎగిరి గంతేయాలనిపించింది. మరుక్షణమే వాడు, వీరసింహుడి కాళ్ళపైబడి, "మహాప్రభూ, మీ కోసం నా ప్రాణాలివ్వడానికైనా సిద్ధంగా వున్నాను!" అన్నాడు.

"మూర్ఖుడా, అదే చేయవద్దంటున్నాను. మాకు నీ ప్రాణాలెందుకు? నువ్వు చస్తే మేము వేరొక కొత్వాలును నియమించవలసి వస్తుంది!" అన్నాడు వీరసింహుడు కోపంగా.

"ప్రభువులు నా కళ్ళు తెరిపించారు. ఇక నా ప్రాణాలు వదలను కాని, ప్రభువులను ఎదిరించేవారి ప్రాణాలు తీస్తాను. ఆజ్ఞాపించండి." అన్నాడు కొత్తకొత్వాలు లేచి నిలబడుతూ.

"సెభాష్! వెళ్ళు. మాకు కావలసింది ఒఠ్ఠి మాటలు కాదు. చేతలు!" అన్నాడు వీరసింహుడు.

వీరసింహుడికి చేతులెత్తినమస్కరించి అక్కడి నుంచి బయలుదేరిన కొత్త కొత్వాలు, పాతవాడికన్నా పరమ కర్కోటకంగా ప్రవర్తించసాగాడు.

తనకు కొత్వాలు పదవిని అంటగట్టిన వీరసింహుణ్ణి సంతోషపెట్టాలన్న తపనతో, పదిమంది భటులను వెంట బెట్టుకుని, శాంతిపురనగరం పొలిమేరలో వున్న వసంతుడి గ్రామం చేరుకున్నాడు. వృద్ధులయిన వసంతుడి తల్లిదండ్రులనూ, వసంతుడి తమ్ముణ్ణీ, చెల్లెనూ, గ్రామం మధ్య వున్న రచ్చబండవద్దకు బరబరా లాక్కుపోయి నిలబెట్టి, వారి గుండెలకు ఈటెను గురిపెట్టి చూపుతూ, "చెప్పండి. వసంతుణ్ణి ఎక్కడ దాచారో చెప్పండి," అని అడిగాడు.

"వసంతుణ్ణి రాజభటులు బంధించి తీసుకుపోయారు బాబూ," అన్నాడు వసంతుడి తండ్రి చేతులు జోడించి.

"ఆ సంగతి ఎవరికి తెలియదు? ఇప్పుడు వసంతు డెక్కడ వున్నాడు? పాతకొత్వాలును గుర్రం పైనుంచి కిందికి తోసి, భటులనుంచి వసంతుణ్ణి తీసుకు వెళ్ళిన ఆ దుర్మార్గు డెవ్వడు? నిజం చెప్పు," అని గద్దించాడు కొత్వాలు.

"మా అన్నను ముసుగు వీరుడు రక్షించినప్పుడు మేము అక్కడలేము. ఆ సమయంలో మీరు కూడా అక్కడే వున్నారని విన్నాం. కాబట్టి మా అన్న ఎక్కడికి వెళ్ళాడో మాకన్నా మీకే తెలిసివుండాలి!" అన్నాడు వసంతుడి తమ్ముడు.

"ఊరేగింపులో మీరు కొత్వాలు వెనకే నడిచి వెళ్ళారు కదా! ముసుగువీరుడు వచ్చినప్పుడు కూడా మీరు అక్కడే వున్నారు కదా!" అని అడిగాడు అక్కడ చేరిన గుంపులో నుంచి ఒక యువకుడు.

"నోర్ముయ్, కుర్ర వెధవా! నేనే గనక అక్కడ వుండి వుంటే మీలో ఒక్కరయినా ప్రాణాలతో తప్పించుకునేవారా?" అంటూ కొత్వాలు కుర్రవాణ్ణి కొరడాతో కొట్టసాగాడు.

"అమాయకుడయిన ఆ కుర్రవాణ్ణెందుకలా కొడుతున్నారు?" అని అడిగాడు మరొక గ్రామస్థుడు.



"శాంతిదేవ మహారాజు కాలంలో ఇలాంటి ఘోరం ఎన్నడూ జరగలేదు!" అన్నాడు ఇంకొక పెద్దమనిషి.

"ఇది తిరుగుబాటుదార్లు నివసించే గ్రామం. తక్షణమే దీనిని తగలబెట్టండి. గ్రామమంతా భస్మమైపోవాలి. ఊఁ.... నిప్పంటించండి," అని భటులను ఆజ్ఞాపించాడు కొత్వాలు.

"మా గ్రామాన్నెందుకు తగలబెడతారు బాబూ, మేమేం తప్పు చేశాం?" అని అరిచారు గ్రామస్థులందరూ దీనంగా ఏకకంఠంతో.

అయినా, ఆ మాటలను పట్టించుకోకుండా, ఇద్దరు భటులు ఒక ఇంట్లోకి జొర



బడి, మండుతూన్న కొరివిని తెచ్చి, ఆ ఇంటి చూరుకు నిప్పంటించారు.

కొత్వాలు ఆనందంతో మీసందువ్వుతూ, "ఒక్క కొంపను కూడా వదలకూడదు. నిప్పంటించండి!" అని అరిచాడు.

కొంతసేపటికల్లా ఊరు ఊరంతా అల్లకల్లోలమయింది. ప్రతి ఇల్లూ అగ్ని జ్వాలలకు ఆహుతయిపోయింది. జనం భయంతో హాహాకారాలు చేశారు. ఒకచోట ఆర్పితే, మరొకచోట మంటలు భగ్గున మండసాగాయి! మంటలలో ఇళ్ళ వెదుళ్ళు పగిలి పెద్దపెద్ద ధ్వనులు పుట్టాయి. అతి భీకరంగా మారిన ఆ దృశ్యాన్ని చూసి కొత్వాలు వికటాట్టహాసం చేసి, భటులు వెంటరాగా గుర్రంపై రాజధానికి తిరిగి వెళ్ళాడు.

* * *

అదొక వర్షం కురుస్తున్న రాత్రి. ఆకాశం మేఘావృతమై అప్పుడప్పుడూ మెరుస్తున్నది. అరణ్యం నుంచి జయపురికి వెళ్ళే మార్గంలో జయానందముని ఒంటరిగా నడుస్తున్నాడు. ఆయన వెనక నెమ్మదిగా పులి నడుస్తున్నది. ముని భుజం మీద ఒక అందమైన చిలుక కూర్చుని ఉన్నది.

ఆ రాజ్యానికి జయపురి రాజధాని. కాని, అది శాంతిపురం లాగా పట్టణం కాదు. చూడడానికి పెద్ద గ్రామం లాగా ఉంటుంది. జయపురి రాజ్యం చాలా చిన్నది. అయినా, స్వతంత్రమైనది. రాజ్యానికి ఒకవైపు సుమేధరాజ్యం, మరొకవైపు సముద్రం సరిహద్దులు. మిగతా రెండువైపులా మహారణ్యం విస్తరించి ఉన్నది.

కొన్ని తరాలకిందట జయపురి సామంతరాజు, సుమేధరాజ్యాధిపతిని ప్రాణాపాయం నుంచి రక్షించాడు. ఆనాటి నుంచి శాంతిపుర రాజులు, జయపురికి సర్వస్వతంత్రం ప్రసాదించారు. పైగా, దానికి రక్షణ కూడా కల్పించారు! ఎందుకంటే, జయపురిపై దాడిజరపాలంటే,

శత్రువులు సుమేధరాజ్యాన్ని దాటుకునే వెళ్ళాలి!

జయపురి రాజు శంకరవర్మ. ఆయన జయానందముని ముఖ్యశిష్యులలో ఒకడు!

ముని, నిర్మానుష్యంగా వున్న బాట గుండా నడిచి, జయపురి పొలిమేరలో వున్న ఆలయం వద్ద ఆగి, "నేను తిరిగి వచ్చేవరకు ఇక్కడే వుండు!" అని పులితో చెప్పి, భుజం మీద వున్న చిలుకను చేతిలోకి తీసుకుని, "మల్లీ, నువ్వు వెళ్ళి, నేను వస్తున్నట్టు రాజుకు చెప్పు." అన్నాడు.

చిలుక రెక్కలల్లార్చి, కోటకేసి రివ్వుమని ఎగిరి వెళ్ళింది.

రాజు శంకరవర్మ ఆలస్యంగా భోజనం ముగించి, శయన గృహానికి బయలుదేరే సమయంలో, "నాయనా!" అన్న పిలుపు విని వెనక్కు తిరిగి చూశాడు.

చిలుక రివ్వున వచ్చి రాజు భుజంపై వాలి, "నాయనా!" అన్నది మళ్ళీ.

"ఏం మల్లీ! ఏమిటి విశేషం," అని అడిగాడు వర్మ.

"మహాత్మా!" అన్నది చిలుక.

"అలాగా!" అంటూ వర్మ భటులను పిలిచి, కోటద్వారాలు తెరవమని ఆజ్ఞాపించాడు!

జయానందముని శంకరవర్మను "నాయనా" అని పిలుస్తాడు. శంకరవర్మ జయానందమునిని "మహాత్మా" అని





సంభోదిస్తాడు. ఈ రెండు మాటలూ పలికి, చిలుక తను వచ్చిన పని నెరవేర్చింది!

శంకరవర్మ మునికి ఎదురు వెళ్ళి నమస్కరించి, "మీరు వర్షంలో ఇంత దూరం రావాలా? మల్లిని పంపితే నేనే మీ సమక్షానికి వచ్చేవాణ్ణి కదా?" అన్నాడు.

"నిజమే. అయినా, నువ్వు నా ఆశ్రమానికి వచ్చావంటే, అది అందరి దృష్టినీ ఆకర్షిస్తుంది కదా! అందుకని నేనే వచ్చాను," అన్నాడు.

ముని ఏదో రహస్యం చెప్పడానికి వచ్చాడని వర్మ గ్రహించాడు. అయన్ను గౌరవంగా రాజమందిరంలోకి తీసుకుపోయి, బట్టలు మార్చుకోమని చెప్ప ఉన్నతాసనంలో కూర్చోబెట్టి, శంకరవర్మ స్వయంగా వేడిపాలు అందించాడు. ఆ తరవాత, ముని ఆజ్ఞానుసారం, ఆయన ఎదుట కూర్చున్నాడు.

"నాయనా, ఈమధ్య నువ్వు మనసులో చాలా బాధపడుతున్నట్టు విన్నాను, నిజమేనా?" అని అడిగాడు ముని.

"అవును మహాత్మా! నిజానికి నేనే మిమ్మల్ని దర్శించి, నా బాధలు చెప్పుకోవాలనుకున్నాను," అన్నాడు వర్మ.

"శాంతిపురంలో జరిగిన సంఘటనలు నీకు బాధకలిగించాయా?" అని అడిగాడు ముని.

"అవును. ఎన్నో తరాలుగా కీర్తిగాంచిన సుమేధ రాజవంశం ఈనాటికి అంతరించిపోయింది. రాజకుటుంబానికి చెందినవాడయినప్పటికీ వీరసింహుడు పరమ కిరాతకుడుగా మారిపోయాడు. రోజు రోజుకూ వాడి దురాగతాలు మితిమించిపోతున్నాయి. వాడి దృష్టి త్వరలో మన రాజ్యం మీద పడవచ్చు!" అన్నాడు శంకరవర్మ.

"ఆ పురాతన వంశం అంతం కాలేదు నాయనా," అని, ముని తన పిడికిలిని తెరిచాడు. ఆయన అరచేతిలో పతకంగల బంగారు హారం కనిపించింది. పతకంమీద సుమేధ రాజవంశపు ముద్ర వున్నది!

దానిని చూడగానే, శంకరవర్మ నేత్రాలు అనందాశ్చర్యాలతో మెరిశాయి.

''ఇది సుమేధ యువరాజు కంఠహారం! మీచేతికెలా వచ్చింది?'' అని అడిగాడు శంకరవర్మ.

''యువరాజుతోసహా హారం నా దగ్గరికి వచ్చింది నాయనా. యువరాజు నాదగ్గరే ఉన్నాడు!'' అన్నాడు ముని.

''ఆనందకరమైన మాటను వెలిబుచ్చారు! యువరాజును పెంచే బాధ్యత నేను వహిస్తాను, మహాత్మా!'' అన్నాడు వర్మ సంతోషంగా.

''ఆ విషయం నాకూ తెలుసు. అయినా అది, నీకుగాని, బిడ్డకుగాని క్షేమమవుతుందా?'' అని అడిగాడు ముని.

శంకరవర్మ కొంతసేపు మౌనంవహించి, తలపంకించి, ''మహాత్మా, తీరాఆలోచిస్తే, అలా చేయడం ఇరువురికీ క్షేమం కాదని పిస్తున్నది. ఎందుకంటే, ఆ దుష్టుడైన వీరసింహుడు, బిడ్డను వెతకడానికి నాలుగు దిక్కులకూ గూఢచారులను పంపాడని తెలిసింది. ఇలాంటి స్థితిలో యువరాజును రహస్యంగా దాచలేము కదా!'' అన్నాడు.

''సత్యం గ్రహించావు. యువరాజు అరణ్యం మధ్య రహస్యంగా పెరగడమే క్షేమం. అయితే, యువరాజుకు చెందిన ఈ హారాన్ని మాత్రం నువ్వు జాగ్రత్తగా భద్రపరచాలి. ఇది అతని మెడలో వుండడం క్షేమంకాదు,'' అన్నాడు ముని.

''చిత్తం, మహాత్మా! అయినా, ఈ స్థితిలో ఇంతకుమించి నేను చేయగలిగిందేమయినా ఉన్నదా?'' అని అడిగాడు శంకరవర్మ.

"నువ్వు చేయవలసింది చాలా ఉన్నది! అయితే, అందుకు తగిన సమయం ఆసన్నం కావాలి. దేనికైనా కాలం కలిసి రావాలికదా. అంతవరకు నిర్భయంగా ఓర్పు వహించు. సుమేధ రాజ్య ప్రజల బాధలనూ, దుఃఖాలనూ పోగొట్టడానికి మనం మన కర్తవ్యాన్ని నిర్వహించాలి!'' అన్నాడు ముని. —(ఇంకావుంది)





# ముగ్గురు మిత్రులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ, హాయిగా శయనాగారంలో హంసతూలికా తల్పం మీద నిద్రించ వలసినవాడివి, భీతిగొల్పే ఈ శ్మశానంలో దేనికోసం తిరుగుతున్నావో అర్థం కావడం లేదు. ఒక్కొక్కసారి మనిషి అహంకారంవల్లనో, అవివేకం కారణంగానో తను ఆశించినదానికి భిన్నంగా ప్రవర్తిస్తాడు. నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు, ఇందుకు ఉదాహరణగా హరిణి అనే అమ్మాయి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం దండకారణ్యంలో ఒక గురుకులం వుండేది. దాని ఆచార్యుడు విద్యా

## బేతాళ కథలు



సాగరుడు. ఏ రాజాశ్రయమూ లేకపోవడం వల్ల, ధనికులెవరూ తమ బిడ్డలను, ఆ గురుకులానికి పంపేవారు కాదు. దానితో విద్యాసాగరుడికి గురుకులం నిర్వహణ కష్టసాధ్యంగా వుండేది. ఆయన సామాన్యుల పిల్లల్నే తన శిష్యులుగా చేసుకుని, వారి అభిరుచిని గ్రహించి, అందుకు తగ్గట్టు ఆయా విద్యలలో శిక్షణ ఇచ్చేవాడు.

గురుకులంలో కొత్తగా హరిణి అనే అమ్మాయి, సాహిత్యాధ్యయనం కోసం వచ్చి చేరింది. సంగీతాన్ని అభ్యసిస్తున్న మల్లినాధుడనేవాడూ, ఖడ్గవిద్యను నేర్చుకుంటున్న శశిధరుడనేవాడూ, ఆమెకు పరిచయం అయ్యారు. వాళ్ళ మధ్య స్నేహం దినదిన ప్రవర్ధమానం కాసాగింది.

హరిణికి సంగీతమంటే ప్రత్యేకమైన అభిమానం. ఆమె, మల్లినాధుడు శ్రావ్యంగా పాడేపాటలను ఎంతో ఆసక్తితో వినేది. ఖడ్గవిద్య నేర్చుకునే శశిధరుడు కూడా కళాపిపాసే. కాని, ఎందువల్లనో అతడు ఏ కళలోనూ ప్రావీణ్యాన్ని సంపాదించుకోలేక పోయాడు.

కొన్నాళ్ళకు హరిణి మంచి కవయిత్రి అయింది. మల్లినాధుడు గొప్ప సంగీత విద్వాంసుడయ్యాడు. శశిధరుడు ఖడ్గ విద్యలో అరితేరాడు.

ఒకనాడు విద్యాసాగరుడు, వాళ్ళతో, "నేటితో మీ శిక్షణ పూర్తయింది. ఇక మీమీ అదృష్టాలను వెతుక్కుంటూ వెళ్ళండి!" అని, శుభం కలగాలని ఆశీర్వదించి సాగనంపాడు.

శశిధరుడు గుర్రం మీద ఒక అడవి గుండా తన ఊరుకు వెళుతూండగా, కొందరు ముసుగు మనుషులు, ఒంటరిగా వున్న ఒకరి మీద దాడి చేయడం కంట బడింది. అతడు వెంటనే ఒర నుంచి కత్తిదూసి, ఆ ముసుగు మనుషులను ఎదుర్కొన్నాడు. మెరుపులా తిరిగే అతడి కత్తి ధాటికి తట్టుకోలేక వాళ్ళు చిందర వందరగా పారిపోయారు.

కొద్దిగా గాయపడి నేల మీద పడివున్న ఆ వ్యక్తి శశిధరుడితో, "నేనీ దేశాన్నేలే రాజును! వేటకై వచ్చి, నా పరివారం నుంచి వేరుపడ్డాను. ఈ ముసుగు మనుషులు బందిపోట్లయి వుండాలి. వాళ్ళను త్వరలోనే నా భటులచేత వేటాడించి తీరుతాను. నువ్వెవరివి? నువ్వు చేసిన సాయం ఎంతో మెచ్చదగింది," అన్నాడు.

"మహారాజా, తమ ప్రశంస నాకు కాదు, మా గురువుగారికి చెందాలి," అన్నాడు శశిధరుడు.

"మీ గురువు అంత గొప్పవాడా? ఏం కావాలో కోరు, యిస్తాను," అన్నాడు రాజు.

"మా గురువుగారైన విద్యాసాగరుల వారికి, గురుదక్షిణ ఇచ్చుకునే శక్తి లేని వాడిని. ఆయన నడుపుతున్న గురుకులానికి, ఏదైనా ద్రవ్యసహాయం చేయండి చాలు," అన్నాడు శశిధరుడు.

రాజు నగరం చేరగానే, ప్రాణాలకు తెగించి తనను కాపాడిన శశిధరుణ్ణి, అంగరక్షకుడుగా నియమించుకున్నాడు. అతడి గురువుకు, ఒక రాజోద్యోగి ద్వారా చాలా ధనం పంపాడు.

ఒకనాడు శశిధరుడు, ఆ నగరంలోనే నివసిస్తున్న మల్లినాధుణ్ణి చూడబోయాడు. అతడి కుటుంబం చాలా పేదరికంలో వున్నది. మల్లినాధుడి దగ్గిర కొందరు పిల్లలు సంగీతం నేర్చుకుంటున్నారు. అయినా, అతడి కొచ్చే ఆదాయం బహు స్వల్పమని శశిధరుడు గ్రహించాడు.





అప్పుడప్పుడు తన చేతనైన ఆర్థికసాయం చేశాడు.

కొద్దికాలంలోనే, సంగీతంలో మల్లినాధుడికున్న ప్రజ్ఞ గురించి నగరంలోని ముఖ్యులందరికీ తెలిసిపోయింది. వాళ్ళు, అతడిచేత తరచుగా సంగీత కచేరీలు పెట్టించసాగారు. అతడి పాట వినేందుకు ప్రతి కచ్చేరీకీ వస్తున్న, ఒకే ఒక వ్యక్తి హరిణి! శశిధరుడు తీరిక వున్నప్పుడు వాటికి హాజరవుతూండేవాడు.

ఒకనాడు మల్లినాధుడు, హరిణిని, "శశిధరుడి కిప్పుడు రాజాస్థానంలో చాలా పలుకుబడి వున్నది. అయినా ఇంత వరకూ అతడు, నాచేత రాజుగారి సమక్షంలో కచేరీ ఏర్పాటు చేయించలేదు. ఇందుకు కారణం, అతడికి నా కీర్తి ప్రతిష్ఠలపట్ల గల అసూయ అయి వుండవచ్చు. ఏమైతేనేం—నువ్వు అతడికి చెప్పి రాజాస్థానంలో నా కచేరీ జరిగేలా చూడలేవా?" అని అడిగాడు.

హరిణి శశిధరుణ్ణి చూడబోయి, మల్లినాధుడి పాటకచేరీ రాజాస్థానంలో జరిగేలా చూడమని కోరింది.

కొద్ది రోజుల్లోనే శశిధరుడి ప్రయత్నం వల్ల, రాజుగారి ఎదట మల్లినాధుడు సంగీత కచేరీ చేశాడు. అతడి గానానికి ముగ్ధుడైన రాజు, మల్లినాధుడు ఊహించని

తన మిత్రుడు రాజుగారి కొలువులో చేరాడని విని, మల్లినాధుడు చాలా సంతోషించి, శశిధరుడితో, "మిత్రమా, ఎలాగైనా నీ పలుకుబడిని ఉపయోగించి రాజుగారి ఆస్థానంలో నాకు ఉద్యోగం వచ్చేలా ప్రయత్నించు," అన్నాడు.

అయితే, శశిధరుడు అతణ్ణి రాజుగారికి పరిచయం చేయకుండా, రాజాస్థానంలోని ఉన్నతోద్యోగులకూ, నగర ముఖ్యులకూ మల్లినాధుడు గొప్ప సంగీత విద్వాంసుడంటూ చెప్పాడు. వాళ్ళల్లో సంగీతాభిమానులు కొందరు, అతడికి సంగీత శిక్షణాలయం పెట్టేందుకు ప్రోత్సాహం యిచ్చారు. శశిధరుడు కూడా అతడికి

రీతిలో అతడికి గొప్పగా ధనం యిచ్చి సత్కరించాడు. అతడి సంగీత శిక్షణా లయం నగరంలోనేకాక, మొత్తం రాజ్యం లోనే ప్రముఖ స్థానానికి చేరుకున్నది.

ఒకనాడు మల్లినాధుడు, తన సంగీత కచేరీకి హాజరై, వెళ్ళిపోతున్న హరిణిని ఆపి, "హరిణీ! చాలాకాలం తర్వాత నా మనసులోని మాటను బయటపెడు తున్నాను. నిన్ను వివాహమాడాలని వున్నది," అన్నాడు.

అందుకు హరిణి శాంతంగా, "నేను మీ ప్రతి కచేరీకి వస్తున్న కారణం, మీ గానంపట్ల నాకున్న అభిమానం మాత్రమే. అందువల్ల వివాహ ప్రసక్తి తేకండి!" అని వెళ్ళిపోయింది.

ఇది విని మల్లినాధుడు, ఈ హరిణి అహంకారే కాదు; అవివేకి కూడా అనుకున్నాడు.

మర్నాడు హరిణి, శశిధరుడి ఇంటికి వెళ్ళి, "క్షమించండి! ఇలా అడుగు తున్నందుకు నన్ను చులకన మాత్రం చేయకండి. నా తల్లిదండ్రులు, నాకు వివాహ ప్రయత్నాలు చేస్తున్నారు. నాకు, మిమ్ములను వివాహమాడాలని వున్నది. ఏమంటారు?" అని అడిగింది.

ఇందుకు శశిధరుడు పరమానంద భరితుడై, తన సమ్మతి తెలిపి, త్వరలోనే ఆమెను వివాహమాడాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సంగీతాభిమాని అయిన హరిణి, ఎంతో



కీర్తివంతుడూ, సంపన్నుడూ అయిన మల్లినాధుడిని కాదని, స్త్రీ సహజమైన సిగ్గును విడిచి అడిగి, శశిధరుణ్ణి వివాహమాడడం దురహంకారం, అవివేకం అనిపించుకోదా? మిత్రుడు అడిగినప్పుడు రాజాస్థానంలో గానకచేరీ ఏర్పాటు చేయని శశిధరుడు, హరిణి కోరినమీదట అందుకు సమ్మతించడం అసూయ కాదా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హరిణి ప్రవర్తనకు దురహంకారాన్నీ, అవివేకాన్నీ అంటగట్టడం పొరబాటవుతుంది. ఆమె విద్యనభ్యసించింది, ఏ రాజాదరణకూ నోచుకోని గురుకులంలో. అందువల్లనే ఆమె ఎంతో తార్కికంగా ఆలోచించి, కీర్తి, సంపదలనే మోహజాలంలో చిక్కుకోకుండా, తన సహాధ్యాయుల్లో వ్యక్తిగా ఎవరు ఉన్నతులో వాళ్ళను వరించింది.

ఇక శశిధరుడి విషయం: అడిగితే సాయం చేసేవాడు మిత్రుడు. అడగకుండానే సాయంచేసేవాడు ఆప్తుడు. అందువల్లనే, శశిధరుడు ముందుగా మల్లినాధుడికి నగర ప్రముఖులతో పరిచయం కలిగించాడు. అతడు వెంటనే మల్లినాధుడికి రాజాస్థానంలో సంగీత కచేరీ చేసే అవకాశంకోసం ప్రయత్నించకపోవడానికి కారణం, అసూయ కాదు. కచేరీకి రాజుగారి అనుమతి లభించాలంటే, ఎదుటివాడికి అర్హత వున్నంత మాత్రాన చాలదు. అది ఋజువుకావాలి! నగర ప్రముఖులూ, సంగీత ప్రియులూ మల్లినాధుడి సంగీత ప్రజ్ఞను మెచ్చుకోవడం ద్వారా అది ఋజువయింది. ఆ సమయంలో హరిణి అడగడం, ఆ తరవాత అతడు రాజాస్థానంలో కచేరీ ఏర్పాటు చేయించడం—అంతా కాకతాళీయం!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: డా॥ కాటిచెర్ల గురురామప్రసాద్ రచన]



# చందమామ అనుబంధం—17
## మన విజ్ఞాన సంపద

### ఎవరాయన?

ఢిల్లీని పరిపాలించిన సుల్తానొకడు దండయాత్రకు బయలుదేరాడు. ఎదురు తిరిగిన వారినందరినీ ఓడించి, అనేక ప్రాంతాలను జయించి, సుల్తాను విజయగర్వంతో ఢిల్లీకి తిరుగుప్రయాణమయ్యాడు.

ఆ కాలంలో ఢిల్లీలో ఒక సాధువు వుండేవాడు. ఆ సాధువు అంటే సుల్తానుకు ఇష్టం వుండేదికాదు. అందువల్ల, సాధువు భక్తులలో ఒకడు ఆయనతో, "సుల్తాను ఢిల్లీకి వస్తున్నాడు. తమరు వేరొక ప్రాంతానికి వెళ్ళడం మంచిది," అన్నాడు.

దానికి సాధువు, "అతనికి ఢిల్లీ ఇంకా చాలా దూరంలో ఉన్నది!" అన్నాడు.

సాధువు మాటలకు అక్కడచేరిన వాళ్ళందరూ అమితాశ్చర్యం చెందారు. ఎందుకంటే సుల్తాను అసరికే ఢిల్లీ నగర శివార్లను చేరుకున్నాడు.

అయితే, సుల్తాను నగరంలో ప్రవేశించేప్పుడు, అతనికి ఘనంగా స్వాగతం చెప్పడానికి ఏర్పాటుచేసిన ద్వారతోరణం విరిగి మీదపడడంతో, అతడు అక్కడికక్కడే ప్రాణాలు కోల్పోయాడు. సాధువు చెప్పినట్టే అతడు ఢిల్లీలో ప్రవేశించలేక పోయాడు!

ఆ సాధువు ఎవరు? సుల్తాను ఎవరు? (36 వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకులు మాట్లాడే భాష ఏది?
2. ప్రపంచంలో రేఖాగణితం గురించి వచ్చిన మొట్టమొదటి పుస్తకం ఏది?
3. ఈనాటి సగటు భారతీయుల ఆయుఃప్రమాణం ఎంత?
4. ప్రపంచంలోకెల్లా ఎక్కువ పంచదారను ఉత్పత్తి చేసే దేశం ఏది?
5. ప్రపంచంలోకెల్లా ఎక్కువ చలనచిత్రాలను నిర్మించే దేశం ఏది? (36 వ పేజీ చూడండి)

భారతదేశం : నాడు - నేడు

# కన్యాకుబ్జంగా పేరుగాంచిన కనోజ్

ఉత్తరప్రదేశ్‌లోని ఫరూకాబాద్ జిల్లాలో వున్న ఈనాటి కనోజ్ చిన్న పట్టణం. ఈ పట్టణానికి సమీపంలో అర్ధవృత్తాకారంలో ప్రాచీన కన్యాకుబ్జ నగర శిథిలాలు దాదాపు ఏడు కి. మీ. దూరం విస్తరించి వున్నాయి.

మహాభారత కాలంలోనూ, అంతకు పూర్వమూ, కన్యాకుబ్జం మహాసామ్రాజ్యానికి రాజధానిగా వెలసింది. 7 వ శతాబ్దంలో, ఈ నగరం అసంఖ్యాకమైన హైందవఆలయాలనుంచీ, బౌద్ధారామాల నుంచీ వెలువడిన శంఖారావాలతోనూ, గంటల గణగణల ధ్వనులతోనూ మారుమ్రోగింది! సుప్రసిద్ధ చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ క్రీ. శ. 636 వ సంవత్సరం ఈ నగరాన్ని సందర్శించి, ఏడేళ్ళు ఇక్కడే గడిపాడు. కన్యాకుబ్జం రాజధానిగానే, హర్షవర్ధనుడు తన పాలనను సాగించాడు. అనేక తటాకాలను తవ్వించి, ఉద్యానవనాలనూ, విశాలమైన బాటలనూ ఏర్పరచి, యాత్రికులకు సత్రాలు నిర్మించి, హర్ష



వర్ధనుడు కన్యాకుబ్జాన్ని అందాల నగరంగా తీర్చిదిద్దాడు.

పదకొండవ శతాబ్దారంభంలో సుల్తాన్ మహ్మద్ ఈ నగరంపై దాడి జరిపి, చాలావరకు నాశనం చేశాడు. రథోర్ రాజులు దానిని పునర్నిర్మించారు. కట్టకడపటి రథోర్ రాజు జయచంద్రుడు, అజ్మీర్-ఢిల్లీ పాలకుడు పృథ్వీరాజు తన కోరికకు విరుద్ధంగా తన కుమార్తెను వివాహమాడాడని, అతనిమీద కత్తి గట్టాడు. పగసాధించడానికి, అతనిపైకి మహమ్మదు ఘోరీని దాడి చేయమని ఆహ్వానించాడు. మొదట ఘోరీ, పృథ్వీరాజు చేతుల్లో ఓడిపోయాడు. కాని, తిరిగివచ్చి అతణ్ణి ఓడించి హతమార్చాడు.

అంతటితో ఆగకుండా, తిరుగు ప్రయాణంలో మహమ్మదు ఘోరీ, జయచంద్రుణ్ణి కూడా ఓడించాడు. ఘోరీ సేనాని కుతుబుద్దీన్ చేతుల్లో జయచంద్రుడు 1112వ సంవత్సరంలో హతుడయ్యాడు.

## చందమామ కబుర్లు




### వాతావరణ కాలుష్యం!

బొంబాయి నగరంలో గాలి పీల్చడమే, రోజుకు పది సిగరెట్లు కాల్చినంత హానికరమట! ఈనాడు నగరాల వాతావరణ కాలుష్యం అంతటి భయానక స్థితికి చేరుకున్నది! ఢిల్లీ నగర పరిస్థితి కూడా ఏమంత మెరుగ్గా లేదు. ఎందుకంటే, ప్రపంచంలోని అత్యంత కాలుష్య పూరిత వాతావరణంగల పది నగరాలలో ఢిల్లీ ఒకటి!

ఇటీవల కొందరు నిపుణులు జరిపిన సర్వేలో ఈ విషయాలు వెలుగులోకి వచ్చాయి. ఈ భయానక స్థితిని పోగొట్టాలంటే — ప్రభుత్వమూ, ప్రభుత్వేతర పరిశ్రమలకు సంబంధించినవారూ, ఇతరులూ అంటే అందరూ కలిసి కట్టుగా కృషి చేయాలి!

### ప్రాణాలు రక్షించే కొత్త యంత్రం!

మంచునీళ్ళలో అరగంటసేపు మునిగిపోయినా, మరణం నుంచి తప్పించుకోవడం సాధ్యమా? లాస్ వేగస్‌కు చెందిన ముర్రే బ్రౌన్ అనే వ్యక్తి మంచునీళ్ళ ప్రవాహంలో మునిగిపోయాడు. అతన్ని పైకి తీసినప్పుడు, అందరూ అతడు మరణించాడనుకున్నారు. మెదడు పనిచేయడం మానేసింది. అయితే, డా॥ ల్యారీ జెంట్‌లెలో రూపొందించిన ఆధునాతనయంత్రంతో, ముర్రే బ్రౌన్‌కు ప్రత్యేక పద్ధతితో వెచ్చదనం కలిగించడంతో, అతడు కొన్ని గంటలలో మామూలు మనిషి అయ్యాడు. దీనిని ఒక వైద్యశాస్త్ర అద్భుతంగానే భావిస్తున్నారు!



# సాహిత్యావలోకనం

1. రెండు సుప్రసిద్ధ బాలల పుస్తకాలు—నిజానికి పెద్దలకని రాయబడ్డాయి. అవి ఏవి?
2. బైబిల్ రెండుభాగాల పేర్లు ఏవి?
3. మొదటి భాగంలో ఎన్ని అధ్యాయాలున్నవి?
4. రెండవ భాగంలో ఎన్ని అధ్యాయాలున్నవి?
5. ప్రపంచంలోకెల్లా అతి పెద్దదయిన పద్యగ్రంథం ఏది?

## సమాధానాలు

### ఎవరాయన?

నిజాముద్దీన్. సుల్తాన్ ఘియాస్-ఉద్దీన్.

### లోకజ్ఞానం

1. చీనా భాష.
2. భారతదేశంలో క్రీ. పూ. 8వ శతాబ్దంలో, రాసినే 'సులభ సూత్ర'.
3. 54 సంవత్సరాలు.
4. భారతదేశం.
5. భారతదేశం.

### సాహిత్యం

1. మార్క్ ట్వైన్ రచించిన 'టామ్‌సాయర్', 'హకిల్ బెర్రీ ఫిన్'.
2. 'ఓల్డ్ టెస్టమెంట్', 'న్యూ టెస్టమెంట్'.
3. 39.
4. 27.
5. మహాభారతం.



# మూడు పరీక్షలు

పూర్వం కేకయ, గాంధార అనే రెండు పెద్ద దేశాల మధ్య కౌముది అనే చిన్న దేశం ఒకటి వుండేది. కొన్ని తరాలకిందట కౌముది కూడా చాలా పెద్దదేశమనీ, అనేక యుద్ధాలలో, ఆ దేశ భాగాలు పొరుగుదేశాలకు స్వాధీనమైపోయాయనీ చెప్పుకునేవారు.

ప్రస్తుత కౌముదీ దేశపురాజు చంద్రకాంతుడు. అతడికి పుత్రసంతానం లేదు. ఉన్న ఒక్కగానొక్క కూతురు జ్యోత్స్ననే కొడుకుగా భావించి, ఆమెకు రాజనీతి, శస్త్రవిద్యలు కూడా నేర్పించాడు. జ్యోత్స్న యుక్తవయస్కురాలయేనాటికి అద్వితీయ సౌందర్యరాశిగానూ, అత్యంత మేధావిగానూ ఖ్యాతికెక్కింది.

కుమార్తెను చూసి గర్వంతో పొంగిపోతూ, ఆమెకు తగిన వరుణ్ణి చూసి పెళ్ళిచేసి, అల్లుడికి రాజ్యం అప్పచెప్పాలని నిశ్చయించుకున్న చంద్రకాంతుడు, ఆమె వివాహం గురించిన ఆలోచనలతో విసిగిపోయి, చివరకు ఆమెతో ఒకనాడు ఇలా అన్నాడు:

"అమ్మా, అత్యంత సులభమని అనుకున్న నీ వివాహం, చివరకు ఒక పెద్ద రాజకీయ సమస్య అయ్యేటట్టున్నది. మనకు ఇరుపక్కలా వున్న రెండు బలమైన దేశాల గురించి, నీకు బాగా తెలుసుగదా! వారిలో కేకయ రాజకుమారుడైన సింహవర్మను, నీ సౌందర్య ప్రశస్తి బాగా ఆకర్షించిందట. యుద్ధంలో నన్ను ఓడించి అయినా, నిన్ను అర్ధాంగిగా చేపట్టాలని అతడు పట్టుదలగా వున్నట్టు, మన వేగులు చెబుతున్నారు.

"ఇక గాంధార రాజకుమారుడైన కృష్ణవర్మ అంతర్యం ఏమిటో, తెలియకపోయినా, అర్హతలున్న కారణంగా అతడూ

లక్ష్మిగాయత్రి



పోటీకి రాకమానడు. ఈ ఇద్దరిలో ఏ ఒకక్రిని నువ్వు వరించినా, రెండోవారితో యుద్ధం తప్పదని, నా భయం.''

చంద్రకాంతుడు ఇంతవరకూ చెప్పి, మౌనంగా జ్యోత్స్న ముఖం కేసి చూడ సాగాడు. తండ్రి ఇంకా ఏమో చెప్ప దలచి సంశయిస్తున్నాడని గ్రహించిన జ్యోత్స్న చిరునవ్వుతో, ''ఆగారేం, నాన్నా? చెప్పదలచిందేమిటో అంతా చెప్పండి,'' అన్నది.

అందుకు చంద్రకాంతుడు, ''ఈ చెప్ప బోయేది గృహ విషయం! మీ అమ్మ మొండిగా నిన్ను తన తమ్ముడికే యిచ్చి చేయాలనిపట్టుబడుతున్నది. పుత్రసంతతి లేని కారణంగా, నా సింహాసనాన్ని ఇతరు లెవరో అధిష్ఠించరాదనీ, తన తమ్ముడు మాణిక్యవర్మ నాకు అల్లుడై కౌముదీ దేశానికి రాజు కావాలనీ, ఆమె కోరిక. ఇక ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో తోచక, నీతో చెబుతున్నాను. మిత్రులు, శత్రువులు కాకుండా, రక్తపుటేరులు పారకుండా, నీ వివాహం జరిపించుకునే భారం నీదే, తల్లీ!'' అన్నాడు.

అంతా విన్న జ్యోత్స్న, ''నాన్నా, ఇవన్నీ నాకు తెలియనివి కావు. ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో కూడా ఆలోచించాను. నన్ను పెళ్ళాడ గోరేవారికి, నేను మూడు పరీక్షలు పెట్ట దలిచాను. ఆ పరీక్షల్లో నెగ్గిన వ్యక్తినే, నేను వరిస్తాను. వివిధ దేశాల రాకుమారు లకూ, వర్తమానం పంపండి,'' అన్నది.

కుమార్తె మాటలు విని, రాజు కుతూ హలంగా, ''మూడు పరీక్షలా! అవేమిటి?'' అని అడిగాడు.

జ్యోత్స్న నవ్వుతూ, ''తొందరెందుకు, నాన్నా? త్వరలో మీరూ చూస్తారుగదా,'' అన్నది.

త్వరలోనే జ్యోత్స్న చెప్పినట్టు వివిధ దేశాలకూ వార్తాహరులు పంపబడ్డారు. అప్పటికప్పుడే పరీక్షలకు కావలసిన ఏర్పాట్లు జరిగాయి. అనేకమంది

రాకుమారులు వచ్చి, అపజయం పొంది వెళ్ళసాగారు.

మాణిక్యవర్మ, సింహవర్మ, కృష్ణవర్మ కూడా, రెండు రోజుల తేడాలో వచ్చారు. ఎప్పటికప్పుడు వేగులద్వారా వార్తలు తెలుసుకుంటున్న జ్యోత్స్న, మాణిక్య వర్మకూ, సింహవర్మకూ వెంటనే స్నేహం కలిసిందనీ, కృష్ణవర్మకూ వారికీ మధ్య ఎటువంటి పరిచయం కూడా లేదనీ విని, మనసులోనే నవ్వుకున్నది. తర్వాత మొదట మాణిక్యవర్మా, పిదప సింహ వర్మా కూడా పరీక్షల్లో పాల్గొని, అపజయం పొందారన్న వార్త కూడా ఆమెకు చేరింది.



ఆ వార్త వింటూనే జ్యోత్స్న, తండ్రికి చెప్పి, కృష్ణవర్మ విడిదికి గట్టిరక్షణ ఏర్పాట్లు చేయించింది.

ఆ మర్నాడు కృష్ణవర్మ పరీక్షా మంది రానికి వచ్చాడు. అక్కడ సిద్ధంగా వున్న జ్యోత్స్న చెలికత్తెలు, అతణ్ణి సాదరంగా ఆహ్వానించి, ఒక గదిలోకి తీసుకు వెళ్ళారు. ఆ గది గోడలనిండా రకరకాల చిత్రాలు వేలాడ కట్టబడి వున్నవి. వాటి మధ్య జగదేకసుందరి అయిన రాకుమారి చిత్రం కూడా వున్నది.

చెలికత్తెలు కృష్ణవర్మకు, ఆ చిత్రాలను చూపిస్తూ, "ఈ చిత్రాలన్నింటిలోనూ సౌందర్యానికీ, చిత్రకారుడి ప్రతిభకూ తార్కాణంగా వున్న గొప్ప చిత్రం ఏదో చెప్పండి!" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న విని కృష్ణవర్మ చిత్రాలన్నిటినీ మరొకసారి పరీక్షగా చూసి, వాటిల్లో ఒక చిత్రాన్ని చూపిస్తూ, "మీరు కోరిన విధంగా వున్న గొప్ప చిత్రం ఇదే!" అన్నాడు.

ఆ చిత్రంలో రంగురంగుల పూలతో నిండివున్న పచ్చటి పొదలమధ్య, తెల్లని ఆవు ఒకటి తన దూడను ప్రేమగా నాకుతున్నది. వాటికి సమీపంలోనే వున్న ఒక కొలను, నిండుగా విరబూసిన పద్మాలతో అత్యంత రమణీయంగా వున్నది.

చెలికత్తెలు ఆ చిత్రాన్ని చూసి పెదవి విరుస్తూ, "ఇన్ని చిత్రాల మధ్య, మీకు



నచ్చిన చిత్రం ఇదా? మా రాకుమారి అపూర్వ సౌందర్యం కంటే, ఈ చిత్రం లోని అందం ఎక్కువా?" అని ప్రశ్నించారు.

వాళ్ళ మాటలకు కృష్ణవర్మ నవ్వి. "బహుశా, ఆమె ప్రశ్నలకు జవాబులు చెప్ప వచ్చిన వారిని తికమక పెట్టడం కోసం, ఈ మాటలు అనవలసిందిగా, మీ రాకుమారి మీకు చెప్పి వుంటుంది! కాని ముమ్మాటికీ ఇది ఉత్తమచిత్రం," అన్నాడు.

"అయితే, అదేదో మాకు కొంచెం వివరంగా చెప్పండి," అని అడిగారు చెలికత్తెలు.

"ఎవరైనా కళాదృష్టితో సౌందర్య విమర్శ చేసేటప్పుడు, శాశ్వతమూ, నిర్మలమూ అయిన ప్రకృతి సౌందర్యానిది మొదటి స్థానం; అశాశ్వతమూ నవరస భరితమూ అయిన మానవ సౌందర్యానిది రెండవ స్థానమూ అవుతాయి. మనిషి అందం స్పష్టం. దాన్ని చిత్రీకరించడానికి, చిత్రకారుడు అట్టే శ్రమపడనవసరం లేదు. ప్రకృతి సౌందర్యం అస్పష్టం. అస్పష్టమైన సౌందర్యాన్ని, తన రంగులతో మనస్సును ఆకట్టుకునేటట్టు చిత్రించడం లోనే, చిత్రకారుడి ప్రతిభ వెల్లడవుతుంది. ఆ ప్రయత్నంలో, ఈ చిత్రాన్ని చిత్రించిన చిత్రకారుడు, పూర్తిగా విజయం సాధించాడు. అందువల్ల, ఇదే ఉత్తమచిత్రం!" అన్నాడు కృష్ణవర్మ.

ఆ సమాధానం వింటూనే చెలికత్తెలు, అతడికి నమస్కరించి, "మా రాకుమారి కోరిన సమాధానం ఇదే! ఇక రెండవ ప్రశ్న చదివి చూడండి," అంటూ ఒక తాళపత్రాన్ని కృష్ణవర్మకు యిచ్చారు.

ఆ పత్రంలో, "వివాహం చేసుకోబోయే స్త్రీ, పురుషుడిలోనూ, పురుషుడు, స్త్రీలోనూ ఏమాత్రం ఎన్నకూడని అంశాలు రెండున్నాయి. అవి ఏవి?" అని రాసి వున్నది.

కృష్ణవర్మ ఆ ప్రశ్న చదివి, "పురుషుడు స్త్రీ సౌందర్యాన్ని, స్త్రీ, పురుషుడి ఐశ్వర్యాన్ని

చూసి వివాహం చేసుకోరాదు. ఎందు కంటే—సౌందర్యం అశాశ్వతం, ఐశ్వర్యం విషయంలోనూ ఆ మాట చాలావరకు వర్తిస్తుంది," అని సమాధానం చెప్పాడు.

ఆ సమాధానం వినగానే, చెలికత్తెల ముఖాల్లో సంతోషం కనిపించింది. వాళ్ళు వెంటనే కృష్ణవర్మకు వంగి వినయంగా నమస్కరించి, "రాకుమారా! మా జ్యోత్స్నాదేవి రెండవ పరీక్షలో కూడా మీరు నెగ్గారు. ఇక చివరి పరీక్షను స్వీకరించండి," అంటూ లోపలికి వెళ్ళి, ఒక చిన్న మంచి గంధపు పెట్టెను తీసుకు వచ్చి, అతడికి ఇస్తూ, "మొదటి రెండు పరీక్షల్లోనూ నెగ్గిన వ్యక్తికి, ఈ పెట్టెను ఇవ్వమని, మా రాకుమారి చెప్పింది. ఈ పెట్టె తాలూకు ఆంతర్యం తెలుసుకోవ డానికి, మీకు ఒక రోజు గడువు ఇవ్వ బడుతుంది. పెట్టెను తీసుకుని మీరు మీ విడిదికి వెళ్ళవచ్చు," అన్నారు.

కృష్ణవర్మ పెట్టె తీసుకుని తిన్నగా విడిదికి తిరిగివచ్చి, పెట్టెను కొంతసేపు పరీక్షగా చూశాడు. చతురస్రాకారంలో వున్న, ఆ పెట్టె పైభాగానా, పక్కలా అందం కోసం ఏవేవో బొమ్మలు చెక్కబడి వున్నవి. పెట్టె లోపల రకరకాల ఎండు టాకులు, పచ్చి ఆకులు, ముళ్ళు, కాస్త గడ్డీ—ఇవన్నీ గలగాపులగంగా వున్నవి. పెట్టె మీద ఒక ఉదయసూర్యుడి బొమ్మ అందంగా చెక్కబడింది. దాని దిగువున ఒక వృక్షం వున్నది. ఆ వృక్షానికి రెండు పాములు మెలిపెట్టుకుని వున్నవి. వృక్షం చుట్టూ ఏవేవో లతలు చెక్కబడి వున్నవి.

కృష్ణవర్మ, వాటి ఆంతర్యం బోధపడిన వాడిలా తలపంకించి, తన భటుడి ద్వారా, పెట్టెతాలూకు ఆంతర్యం తెలియజేయ డానికి, మరి మూడు రోజులు గడువు కావలసిందిగా, జ్యోత్స్నకు కబురు పంపాడు. ఆ రోజే చీకటిపడిన తర్వాత అతడు మారువేషంలో, గుర్రం మీద కౌముదీదేశానికి తూర్పుదిక్కుగా బయలు దేరాడు. —(ముగింపు వచ్చే సంచికలో)



# ఎవరు సన్యాసి?

ఒకనాటి మిట్టమధ్యాహ్నంవేళ, ఇద్దరు యువసన్యాసులు—నందుడు, సునందుడు అనే వాళ్ళు అరణ్యమార్గాన పోతున్నారు. వాళ్ళ గురువైన జ్ఞాననేత్రుడి ఆశ్రమం అక్కడికి చాలా దూరంలో వున్నది. చీకటి పడకముందే ఆశ్రమం చేరాలని, వాళ్ళిద్దరూ వేగంగా నడుస్తున్నారు. మార్గమధ్యంలో వాళ్ళకొక వాగు అడ్డం వచ్చింది. వాగులో వున్నవి మోకాటిలోతునీళ్ళే అయినా, నీటి ఉరవడి తీవ్రంగా వున్నది.

యువసన్యాసు లిద్దరూ వాగు దాటే ప్రయత్నంలో వుండగా, దాని ఒడ్డునే ఒక యువతి వాగు నీటికేసి బెదురుచూపులు చూస్తూ కనిపించింది.

"ఎవరమ్మా నువ్వు? ఎక్కడికి వెళ్ళాలి?" అని ఆమెను సునందుడు ప్రశ్నించాడు.

"ఈ వాగు దాటితే, మా పల్లె. ఈ నీటివేగం చూస్తూంటే, నాకు భయంగా వున్నది," అన్నది యువతి.

"వాగు దాటేందుకు నేను సాయం చేస్తాను!" అంటూ సునందుడు, ఆమెను రెండు చేతులతోటీ ఎత్తుకుని, అవతలి ఒడ్డున దించాడు.

యువతి, సునందుడికేసి కృతజ్ఞతగా చూసి తన పల్లెకేసి నడిచిపోయింది.

ఆ తర్వాత సన్యాసు లిద్దరూ, గురువుగారి ఆశ్రమం కేసి నడవసాగారు. దారిలో ఒకటి, రెండుసార్లు సునందుడు పలకరించినా, నందుడు పలకక మౌనంగా నడవసాగాడు.

ఆశ్రమం మరి కొద్దిదూరంలో వున్నదనగా నందుడు తీవ్రస్వరంతో, "సునందా! మనం సర్వసంగ పరిత్యాగులమైన సన్యాసులం గదా! స్త్రీని కన్నెత్తి అయినా చూడ కూడదు. అటు వంటిది, వాగు దగ్గిర నువ్వాయువతిని పలకరించడమే కాక, రెండు చేతులలో ఎత్తుకుని మోస్తూ, వాగు దాటించావు. సన్యాసివైన నీకు ఇది తగునా?" అని ప్రశ్నించాడు.

అందుకు సునందుడు, "నందా, నేనా యువతిని వాగు దాటించి అక్కడే వదిలేశాను. కాని, నువ్వింకా ఆమెను మోస్తూనే వున్నావన్నమాట!" అని జవాబిచ్చాడు. —జి. సి. జీవి





# వృత్తిదేవత

చాలా ఏళ్ళ క్రితం చీనాలోని ఒక గ్రామంలో చాంగ్‌లా అనే టోపీల వ్యాపారి ఉండేవాడు. టోపీలు తయారు చెయ్యటం అతనికి వంశపారంపర్యంగా వస్తున్న వృత్తి. చాంగ్‌లా తండ్రి ఈ వృత్తిలో తరగని ఆస్తి సంపాదించి, చనిపోతూ టోపీల వృత్తిని మానవద్దని చెప్పాడు.

కాని తండ్రిపోయిన తరవాత చాంగ్‌లాకు, అంత ఆస్తి పెట్టుకుని టోపీల వృత్తి చెయ్యటం ఇష్టం లేకపోయింది. అయినా, ఉన్నట్టుండి ఆ వృత్తి మానేస్తే "వృత్తిదేవత"కు కోపం రావచ్చునని అతనికి కొద్దిగా భయం మాత్రం వుండేది. అతను వృత్తి మానుకోవటానికి బదులు, టోపీలను నిర్లక్ష్యంగా కుట్టి, హెచ్చు ధర అడగ నారంభించాడు. గ్రామస్థులకు అసహ్యం పుట్టి, పక్క గ్రామం నుంచి వాంగ్‌లా అనే వాణ్ణి తెచ్చుకున్నారు.

వాంగ్‌లా కుచ్చు టోపీలు కుట్టటంలో నేర్పరి. అతను టోపీలతోబాటు రకరకాల సంచులు కూడా కుట్టేవాడు. అతను చాంగ్‌లా దుకాణానికి ఎదురుగానే తన దుకాణం ఏర్పాటు చేసుకున్నాడు. అందరూ వాంగ్‌లా టోపీలే కొనసాగారు.

ఒకనాడు చాంగ్‌లా తన దుకాణంలో విశ్రాంతిగా కూర్చుని, వాంగ్‌లా దుకాణంలోకి ఒక సన్యాసి వెళ్ళటం చూశాడు. ఆ సన్యాసివద్ద బంగారంలాగా మెరుస్తున్న జింక చర్మం ఉన్నది. ఆయన దాన్ని వాంగ్‌లా కిచ్చి, దానితో ఒక జోలె కుట్టమని చెప్పి, వెళ్ళిపోయాడు.

వాంగ్‌లా ఆ రోజు అంతా పనిచేసి, సన్యాసికి కావలసినట్టుగా జోలె కుట్టి, దాన్ని దుకాణంలో గోడకు తగిలించాడు.

అయితే మర్నాటినుంచీ వాంగ్‌లా గ్రామస్థులకు డబ్బు తీసుకోకుండా

చీనా జానపద కథ

టోపీలు ఇయ్యటమూ, సన్యాసులకు విందులు చెయ్యటమూ మొదలుపెట్టాడు.

నిన్నగాక మొన్న వచ్చిన వాంగ్‌లా ఇలా దానధర్మాలు చేయటంలో ఏదో రహస్యం వున్నదనీ, అది తెలుసుకోవాలనీ చాంగ్‌లా అనుకున్నాడు.

ఒకనాడు వాంగ్‌లా తన దుకాణం మూయగానే చాంగ్‌లా అతని దుకాణం వద్దకు వెళ్ళి, తలుపు సందు నుంచి లోపలికి చూశాడు. లోపల వాంగ్‌లా సన్యాసి కోసం తయారుచేసిన జోలెను దులుపుతున్నాడు. దాని నుంచి బంగారు నాణాలు జలజలా రాలుతున్నాయి.

చాంగ్‌లా తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. మర్నాడు కూడా అలాగే చూసేసరికి ఆ జోలె కాజెయ్యాలని చాంగ్‌లాకు దుర్బుద్ధి పుట్టింది.

మర్నాడు వాంగ్‌లా తన దుకాణంలో నుంచి లోపలికి ఏదో పని మీద వెళ్ళిన సమయంలో చాంగ్‌లా అతని దుకాణంలోకి వెళ్ళి, గోడకు ఉన్న జోలె తీసుకుని, దాని స్థానంలో నకిలీ జోలె ఒకటి తగిలించి తన దుకాణానికి తిరిగి వచ్చాడు.

ఆ రోజు చీకటి పడినాక చాంగ్‌లా తన దుకాణం మూసి, తాను దొంగిలించి తెచ్చిన జోలెను దులిపాడు. దాని నుంచి బంగారు నాణాలు పడకపోగా, చాంగ్‌లా ఇంట ఉండిన బంగారు వస్తువులు మాయమయాయి.

చాంగ్‌లా హతాశుడై, వాంగ్‌లా వద్దకు వెళ్ళి, జరిగిన సంగతి చెప్పి, తనను రక్షించమని వేడుకున్నాడు. జనం చాలా మంది పోగయారు. ఆ జనం మధ్య నుంచి వెనకటి సన్యాసి వచ్చి, "చాంగ్‌లా, నీకు నీ వృత్తిలో నమ్మకం లేదు. ఇక ఆ జోలె నీకు శాశ్వతం!" అని చెప్పి అదృశ్యమయాడు.

అంతే, ఆ రోజు నుంచీ చాంగ్‌లా ఆ జోలె భుజానికి తగిలించుకుని, ముష్టెత్తుకుని జీవించాడు. ఈ వార్త దేశమంతా పాకిపోయింది. "వృత్తిదేవత" ఆ సన్యాసి రూపంలో వచ్చినట్టు చెప్పుకున్నారు.





# శ్రీ జగన్నాథ చరిత్ర

అవంతీరాజ్యాన్ని ఇంద్రద్యుమ్ను డనే రాజు పరిపాలించేవాడు. ఆయన ధర్మ పాలనలో ప్రజలు ఎటువంటి లోటూ లేకుండా సుఖశాంతులతో జీవించారు. వారికి యుద్ధభయం లేదు; పాడిపంటలకు కొదవలేదు. దానధర్మాలు చేయాలన్నా పుచ్చుకోవడానికి ఎవరూ వచ్చేవారుకారు. ఎందుకంటే, లేనివారంటూ ఆ రాజ్యంలో లేనేలేరు. ఇంద్రద్యుమ్నుడు కళాభిమానిగానూ, కవి పండిత పోషకుడుగానూ కీర్తి గాంచాడు. ఆయన ధర్మపాలననూ, సుగుణాలనూ పొగుడుతూ కవులు కావ్యాలు రచించారు.

ఇంత సాధించినప్పటికీ, రాజును ఎప్పుడూ ఏదో అసంతృప్తి వెంటాడసాగింది. తనకు తీరని కోరిక ఏదీ లేదు. అయినా, తెలియని అసంతృప్తి తన నెందుకు ఇలా బాధిస్తున్నదన్న విషయం, రాజుకు మొదట అంతుబట్టలేదు. కారుమబ్బులు తొలగిపోగానే, ఆకాశంలో చందమామ చల్లని వెన్నెల వెదజల్లినట్టు, క్రమంగా ఆయన మనసులోని కోరిక బయటపడింది. యథాలాపంగా ఆయన కొక ఆలోచన తట్టింది. భావితరాల భక్తులకు యాత్రాస్థలం కాగల బ్రహ్మాండమైన దేవాలయం నిర్మించాలి! ఆ ఆలోచన కలగగానే ఆయనలో అంతకు పూర్వమున్న అసంతృప్తి కాస్త తగ్గింది. అయినా, నిర్మించిన ఆలయంలో ఏ దైవవిగ్రహం ప్రతిష్ఠించాలన్న సమస్య ఎదురయింది.

## 1. ఆలయ నిర్మాణం



రాజు ఒకనాడు రాత్రి పడుకునేముందు ఈ విషయం గురించి గాఢంగా ఆలోచిస్తూ, అలాగే నిద్రపోయాడు. అప్పుడాయనకు ఒక కల వచ్చింది: ''మొదట ఆలయనిర్మాణం పూర్తి కానివ్వు; కాలం ఆసన్నమయినప్పుడు విగ్రహం దానంతట అదే వస్తుంది!'' అన్న దివ్య స్వరం వినిపించింది.

రాజు అమితానందంతో నిద్రలేచాడు. ఆయన మనసులోని విచారం మటుమాయమయింది. తెల్లవారగానే మంత్రులను పిలిపించి, తన మనోరథాన్ని తెలియజేశాడు. వాస్తుశాస్త్రవేత్తలను పిలిపించి, ఆలయనిర్మాణానికి తగిన స్థలనిర్ణయం చేయమన్నాడు. జ్యోతిష్కులను రప్పించి, ఆలయ శంకుస్థాపనకు ముహూర్తం పెట్టమని ఆదేశించాడు.

ఒక శుభముహూర్తాన, సువిశాలమైన పూరీ సముద్రతీరంలో మేళతాళాలతో, వేద మంత్రాలతో, ఆగమవేత్తల అధ్వర్యంలో ఆలయ నిర్మాణ కార్యక్రమం ప్రారంభమయింది!

ఆలయ నిర్మాణానికి కావలసిన ప్రత్యేకమైన పెద్ద పెద్ద బండరాళ్ళను దూరప్రాంతాల కొండల నుంచి తెప్పించారు. సముద్రంగుండా, నదులగుండా, ఓడలలోనూ, పడవలలోనూ, ఏనుగులు పూన్చిన బళ్ళ మీదా వాటిని సముద్ర తీరానికి చేరవేశారు.

దేశం నలుమూలల నుంచి వచ్చిన వేలకొలది శిల్పులూ, పనివాళ్ళూ రాత్రింబవళ్ళు ఆలయ నిర్మాణానికి పూనుకున్నారు. భక్తిశ్రద్ధలతో నిండిన వాళ్ళ ఉత్సాహం; నిర్విరామ పరిశ్రమ ఫలితంగా కఠినశిలలలో అందమైన పువ్వులు పుట్టుకొచ్చాయి. అపురూపశిల్పాలు రూపులు దిద్దుకున్నాయి. కొన్ని సంవత్సరాలలో ఆలయ నిర్మాణం పూర్తయింది. కడలి తరంగాలు స్పృశించే సాగర తీరంలో మేఘాలను అందుకునే ఎత్తుకు బ్రహ్మాండమైన ఆలయం ఎదిగింది!

ఆలయనిర్మాణం పూర్తికాగానే, గుడిలో దేవుడెక్కడ—అని అందరూ ప్రశ్నించ సాగారు. రాజు కూడా ఈ విషయమై తీవ్రంగా ఆలోచించసాగాడు. దిగులుపడ సాగాడు.

ఒకనాడాయన ఆలయంలో ప్రవేశించి గర్భగుడికేసి చూస్తూ కూర్చుని, "దేవా, ఈ గుడిలో ఏ రూపంలో కొలువు తీరాలని నీ సంకల్పం. ఆ విషయం తెలియజేయ వలసిన సమయం ఇంకా ఆసన్నం కాలేదా? ఇంకా ఎంతకాలమని వేచి వుండాలి? ఇన్ని శ్రమలకోర్చి నిర్మించిన ఈ ఆలయం ఇలా శూన్యంగా వుంటే, నలుగురూ నన్ను చూసి నవ్వరా?" అని కన్నీళ్ళతో ప్రార్థించాడు.

ఆ రోజు రాత్రి రాజు ఒక కలగన్నాడు: "ఇక్కడికి సమీపంలోనే దేవుడు శ్రీ కృష్ణ రూపంలో ఉన్నాడు. అన్వేషిస్తే ఆ కరుణా సింధువు నీ వశమవుతాడు!" అన్న దివ్య సందేశం అందింది.

భక్తులతో దాగుడుమూతలాడడం కృష్ణుడి స్వభావం గనక, అతడి విగ్రహం అంత సులభంగా లభ్యం కాదని రాజు గ్రహించాడు. ఆ మహానుభావుణ్ణి కనుగొన గలవాడు నిర్మల హృదయం గల వివేక సంపన్నుడయిన భక్తుడై వుండాలి. అందు వల్ల ఆ మహా కార్యాన్ని రాజు తన ఆస్థానం లోని నలుగురు పండితులకు అప్పగించాడు. నలుగురూ నాలుగు దిక్కులకు బయలుదేరారు.





సమీపించాడు. మృదంగ ధ్వనులూ, వేణునాదమూ, కరతాళ ధ్వనులూ కలిసి ఒక అద్భుత గానం వినిపించింది. కొండకు అవతలివైపు నుంచి సంగీతం వస్తున్నట్టు విద్యాపతి గ్రహించాడు.

అతడు మెల్లగా కొండ ఎక్కి చూశాడు. కొండనానుకొని అందమైన లోయ. అక్కడ కొందరు కోయయువతులు పాడుతూ నృత్యం చేస్తున్నారు. ఆ దృశ్యాన్ని చూస్తూ, విద్యాపతి పక్కనున్న చెట్టు కొమ్మను పట్టుకుని నిలబడ్డాడు. చాలాదూరం కాలి నడకనే రావడంవల్ల అలిసిపోయిన విద్యాపతికి ఆ దృశ్యం ఎంతో హాయిని కలిగించింది!

అ నలుగురిలో చిన్నవాడయిన విద్యాపతి తూర్పుదిక్కుగా బయలుదేరి కొంత దూరం వెళ్ళి, ఆ తరవాత ఉత్తరం దిక్కుగా తిరిగాడు. అక్కడ అరణ్య ప్రాంతం ఎదురయింది. మనసులో కృష్ణుణ్ణి ప్రార్థిస్తూ, తనను నడిపించే భారం దేవుడిదే అన్న శరణాగత భావంతో, దేవుడు చూపిన మార్గంలో నడుస్తున్నట్టు భావిస్తూ అడవిలో ప్రవేశించాడు. పోను పోను అడవి మరీ దట్టం కాసాగింది.

అరణ్యం మధ్య చిన్న కొండ కనిపించింది. కొండనుంచిలయబద్ధమైనసంగీతం వినవచ్చింది. ఇది సంగీతపర్వతం కాదు కదా అనుకుంటూ విద్యాపతి దానిని

హఠాత్తుగా పులిగాండ్రింపు విని ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూశాడు విద్యాపతి. పులి గాండ్రిస్తూ అతనికేసి పరిగెత్తి వస్తున్నది. ఏమి చేయడానికీ తోచక హడలిపోయి అతడక్కడే స్పృహ తప్పి పడిపోయాడు!

'రాజా!' అన్న స్త్రీ కంఠస్వరం వినగానే పులి చటుక్కున ఆగిపోయింది.

"ఇలా తిరిగిరా!" అని పిలిచిందా స్త్రీ మళ్ళీ.

పులి వెనుదిరిగి మెల్లగా స్త్రీల కేసి వెళ్ళి తనను పిలిచిన యువతి పాదాలవద్ద కుక్కపిల్లలా పడుకుంది. ఆ యువతి

పులి వీపుపై ఆప్యాయంగా తట్టింది. అక్కడున్న యువతులందరిలోకీ ఆ యువతి ఎత్తుగానూ, ఎంతో అందంగానూ ఉన్నది. ఆమె పేరు లలిత; కోయదొర విశ్వావసు ఏకైక కుమార్తె!



లలిత చెప్పగానే, ఇద్దరు యువతులు పరిగెత్తిపోయి, స్పృహ తప్పి పడివున్న విద్యాపతికి అరటి ఆకులతో మెల్లగా వీచారు. ఇంకొక యువతి, దగ్గరున్న సెలయేటి నుంచి తామరాకుతో నీళ్ళు తెచ్చి, అతని ముఖం మీద చిలకరించింది. అతడు మెల్లగా కళ్ళు తెరిచాడు. యువతులు తాగడానికి నీళ్ళిచ్చారు.

ఆ తరవాత లలిత అతన్ని సమీపించి, ''నువ్వెవరో మాకు తెలియదు. ఎక్కడి నుంచి ఎక్కడికి వెళుతున్నావో కూడా తెలియదు. బహుశా అడవిలో దారి తప్పి ఇలా వచ్చి వుంటావు. నిన్నీస్థితిలో వదిలి వెళ్ళడానికి మనసొప్పడం లేదు. మా వెంట, మా గూడానికి వస్తావా?'' అని అడిగింది.

ఆమె మాటలకు విద్యాపతి ఆనందించాడు. ఆమె వెంట వెళ్ళడానికి మౌనంగా లేచి నిలబడ్డాడు.

లలిత ముందు దారితీయగా, విద్యాపతీ, చెలికత్తెలూ ఆమె వెంట నడిచారు. లలిత ఒక యువతిని దగ్గరికి పిలిచి, తాము వస్తూన్న సంగతి తండ్రికి ముందుగా తెలియజేయమని చెప్పింది. ఆ యువతి పరిగెత్తుకుంటూ వెళ్ళి కొంతసేపటికి చెట్లమధ్య మాయమయింది.

మరి కొంతసేపటికి ఎదురుగా వున్న చిన్న కొండమీద ఆజానుబాహుడైన కోయదొర విశ్వావసు ఎదురై, విద్యాపతికి చేతులెత్తి నమస్కరిస్తూ, ''నీకు మా హృదయపూర్వక స్వాగతం తెలియజేస్తున్నాము,'' అన్నాడు గంభీరంగా.

విద్యాపతి ప్రతినమస్కారం చేస్తూ, ''ఇంద్రద్యుమ్న మహారాజు పంపగా ఒక దైవకార్యార్థం నేను ఇటు వచ్చాను,'' అన్నాడు.



ఆయన వివరణలను విశ్వావసు, లలిత చాలా ఆసక్తిగా విన్నారు.

ఆ సమయంలో లలిత తనపట్ల అభిమానం చూపడం విద్యాపతి గమనించాడు. కాని, తాను సాధించాలని బయలుదేరి వచ్చిన కార్యం మహోన్నతమైనది. అందువల్ల అతడు దాని మీదే మనసు లగ్నం చేసి, తరచూ భగవధ్యానంలో గడిపేవాడు!

ఉన్నట్టుండి విద్యాపతికి జబ్బు చేసింది. ఆ సమయంలో లలిత, దగ్గరే వుండి పరిచర్యలు చేసింది. ఒకరికొకరు సన్నిహితులయ్యారు. ఆ సమయంలో, లలిత మాత్రమే కాదు; తను కూడా ఆమెను అభిమానిస్తున్నట్టు విద్యాపతి గ్రహించాడు.ఇరువురికీవివాహంజరిపించాలని విశ్వావసు ఆశించాడు. అందుకు విద్యాపతి కూడా సమ్మతించాడు.

వసంతరుతువు రాకతో ప్రకృతి పచ్చదనంతోనూ, రకరకాల పువ్వులతోనూ నిండిపోయింది. కోయిలపాటలు, కోయ యువతుల ఆటపాటల మధ్య లలితా, విద్యాపతుల వివాహం అత్యంత వైభవోపేతంగా జరిగింది!

సంతోషంగా కొన్నాళ్లు గడిచిపోయాయి. లలితను పెళ్ళాడినందుకు విద్యాపతి సంతోషించినప్పటికీ, తను రాజధాని

విద్యాపతిని గౌరవమర్యాదలతో తమ గూడానికితీసుకుపోయి, అతనికి కావలసిన వసతులన్నీ ఏర్పాటు చేశాడు విశ్వావసు. ఇంతలో, విద్యాపతి గొప్ప పండితుడని గ్రహించి, ఆయన పరమానందం చెందాడు. కొన్నాళ్ళు అక్కడే వుండి, వేదాంత రహస్యాలు తెలియజేయమని విద్యాపతిని ప్రార్థించాడు!

విద్యాపతి కూడా అందుకు అంగీకరించాడు. అక్కడే కొంతకాలం వుండాలన్న భావం అతని మనసులో ఏర్పడింది. విద్యాపతి, శృతులనుంచీ, స్మృతులనుంచీ శ్లోకాలు చెబుతూ, వాటి అర్థతాత్పర్యాలను ఉదాహరణలతో వివరించసాగాడు.

నుంచి వచ్చిన దైవకార్యం ఇంకా నెరవేరలేదన్న బాధ అతన్ని అనుక్షణం వేధించసాగింది!

ఈ సమయంలో అతడొక విషయం గమనించాడు. విశ్వావసు రోజు తప్పకుండా వేకువజామున నిద్రలేచి, ఎక్కడికో వెళ్ళి, సూర్యోదయం అయ్యాక తిరిగి వస్తున్నాడు. గాలీ, వానా, తుఫాను ఏది వచ్చినా అతడు వెళ్ళడం మానడం లేదు. విశ్వావసు అచంచలమైన పట్టుదలకు విద్యాపతి ఆశ్చర్యం చెందాడు. విశ్వావసు అలా ఎక్కడికి వెళ్ళివస్తున్నాడో తెలుసుకోవాలన్న ఆసక్తి అతనికి ఎక్కువయింది. లలితను అడిగాడు.

"అది మా వంశానికి సంబంధించిన రహస్యం. దానినెవరికీ చెప్పకూడదు. అయినా, భర్తవైన నీనుంచి ఎటువంటి రహస్యాలూ దాచలేకుండా వున్నాను. ఇక్కడికి సమీపంలో ఒక గుహ వున్నది. ఆ గుహలోపల, తరతరాలుగా మా పెద్దలు పూజిస్తూన్న దేవుడున్నాడు. ఆ దేవుణ్ణి ఆరాధించడానికే మా తండ్రి రోజు తప్పకుండా వెళ్ళివస్తాడు. మా తండ్రిలాగానే, మా తాత ముత్తాతలు కూడా ఆ దేవుణ్ణి ఆరాధించారని చెబుతారు," అన్నది లలిత.

"నాకు ఆ దేవుణ్ణి చూడాలని ఉన్నది!" అన్నాడు విద్యాపతి ఉత్సాహంగా.

"ఆ దేవుణ్ణి గురించి ఇతరులకు చెప్పడమే అపరాధంగా భావిస్తాడు మా తండ్రి. అలాంటప్పుడు చూడడమంటే ఇంకేమైనా వుందా? దయచేసి ఆ కోరికను వదులుకోండి," అన్నది లలిత ప్రాధేయపడే ధోరణిలో.

"నిన్ను పెళ్ళాడిన తరవాత కూడా నన్ను పరాయివాడిగానే భావిస్తున్నావా?" అని అడిగాడు విద్యాపతి బాధగా.

లలిత కొంతసేపు మౌనం వహించి, "సరే, నిన్ను ఆ గుహ దగ్గరికి తీసుకువెళ్ళి, దేవుణ్ణి చూపమని మా తండ్రితో చెబుతాను. నిశ్చింతగా వుండు!" అని చెప్పింది లలిత! —(ఇంకావుంది)






గొప్పగొప్ప రాజులు పరిపాలించిన ఉజ్జయినీ నగరాన్ని ఒకప్పుడు నీతి పాటించని ఒక రాజు పాలించాడు. అతడు అసమర్థుడు కూడా. అతని దుర్మార్గాన్ని సహించలేక ప్రజలలో గట్టివాళ్ళు నాయకత్వం వహించి రాజు మీద తిరుగుబాటు లేవదీశారు. ప్రజల ఆగ్రహానికి వెరచి దుష్టుడైన రాజు ఉజ్జయిని విడిచి పారిపోయాడు.

ఉజ్జయిని సమీపంగా నర్మదానది ప్రవహిస్తుంది. నర్మదకు ఆవలి ప్రాంతాన్ని రాజమార్తాండుడు పాలించేవాడు. రాజ్యభ్రష్టుడైన ఉజ్జయినీరాజు రాజమార్తాండుని శరణుజొచ్చాడు. రాజమార్తాండుడు ఉజ్జయినీరాజు దుర్మార్గాన్ని తలచక, అతనికి కలిగిన ఆపదను మాత్రమే చూసి జాలిపడి, ఉజ్జయినిని తన సేనలతో జయించడానికి సిద్ధపడ్డాడు.

ఈలోపుగా ఉజ్జయినిలో ప్రజారాజ్యం ఏర్పడింది. దేశంలోని పెద్దలూ, పిన్నలూ, యువకులూ, యోధులూ కొత్తప్రభుత్వాన్ని గట్టిగా బలపరిచారు. అక్రమమైన శాసనాలు రద్దయాయి. వృత్తివాణిజ్యాలు సక్రమంగా, అధికారుల ఒత్తిడి లేకుండా సాగాయి. ప్రజలకు చోరభయమూ, ప్రాణభయమూ లేకుండా పోయింది. తమ కొక కొత్త జీవితం ప్రారంభమైనట్లు ప్రజలు సంతోషించారు.

ఈ సమయంలో రాజమార్తాండుడి యుద్ధయత్నాలను గురించి ఉజ్జయినికి వేగులద్వారా వార్త తెలిసింది. దేశ పరిపాలనకు ఎన్నుకోబడిన వృద్ధులూ, వారికి తోడుగా వున్న మధ్యవయస్కులూ ఈ వార్త విని కంగారుపడ్డారు. ఉజ్జయినికి సైనికబలం చాలా కొద్ది. చూడగా రాజమార్తాండుడు యుద్ధంలో ఆరితేరినవాడు



పెద్ద సైన్యం ఉన్నది. సైనికులను ఆయత్తం చేయడానికైనా ఉజ్జయిని ప్రజలకు వ్యవధి లేకపోయింది.

రచ్చపట్టులో బహిరంగసభ జరిగింది. యువకులంతా సభకు హాజరయ్యారు. "ఉజ్జయిని రక్షించబడాలి." అనే నినాదాలు మిన్నుముట్టాయి.

"ఉజ్జయినిని ఎవరు రక్షిస్తారు ? ఎలా రక్షిస్తారు ? ఉపాయం చెప్పగలవాళ్ళు ముందుకు రండి." అని అడిగారు పెద్దలు.

యువకులలో నుంచి విక్రముడనేవాడు ముందుకు తోసుకువచ్చి, "ఇరవైమంది యోధులను నాకివ్వండి. నేను ఉజ్జయినిని రక్షిస్తాను," అన్నాడు.

ఈ మాట విని అందరూ ఆశ్చర్య పోయారు. ఇరవైవేలమంది ఆరితేరిన సైనికులను ఈ విక్రముడు ఇరవైమంది యోధులతో ఎదిరిస్తాడా ? ఎలా సాధ్య మవుతుంది ?

ఈ ప్రశ్నకు విక్రముడు ఈ విధంగా సమాధానం చెప్పాడు :

"ఉజ్జయినికి రాజమార్తాండుని సైన్యాలు రావడానికి ఒకే ఒక మార్గం ఉన్నది. అది నర్మదానది పైన గల వంతెన. ఆ వంతెన పైన ఒకడి వెనుక ఒకడు మాత్రమే నడవగలరు. ఈ వంతె నను రాజమార్తాండుని సైనికులయినా ఒక్కొక్కడే దాటాల్సి వుంటుంది. అందు వల్ల వంతెనమీది స్తంభాలచాటున మన యోధులు నిలబడినట్టయితే ఒక్క పురుగు కూడా దాటి రాకుండా కడతేర్చవచ్చు. ఈ లోపుగా అవసరమైతే మన ఈ యోధులే వంతెనను కూడా పడగొట్టవచ్చు. కనుక రాజమార్తాండుని సైనికబలాలు చూసి మనం ఏమాత్రం వెరువ నవసరం లేదు."

ఈ మాటలకు అందరూ హర్షించారు. అప్పటికప్పుడే ఇరవైమంది యువకులు విక్రముడి వెంట వెళ్ళడానికి ముందుకు వచ్చారు. వీరికి కత్తులూ, గంధ్రగొడ్డళ్ళూ ఇచ్చి విక్రముడు సాధ్యమైనంత వేగంగా

నర్మదాతీరాన్ని చేరుకున్నాడు. వంతెన స్తంభాలచాటున తాము నిలబడడానికి వారు ఏర్పాట్లు చేసుకున్నారు. వంతెన మీద నడిచేవారిని వీరు సులభంగా వధించగలరు. కాని, నడిచేవారికి మాత్రం ఈ యోధులు చిక్కటానికి సావకాశం లేదు.

సూర్యోదయ మవుతూనే రాజమార్తాండుని సైనికులు కొయ్యవంతెన దాటడానికి ప్రారంభించారు.

వంతెన మీద అందరికన్న మొదట నిలబడ్డవాడు విక్రముడు. ముందు వంతెన ఎక్కవచ్చేవారిని విక్రముడు తన కత్తికి బలిచేయసాగాడు. రాజమార్తాండుని సైనికులు నివ్వెరపడి ఈ అదృశ్యమృత్యువును అర్థం చేసుకోలేకపోయారు. దానిని అన్వేషించటానికి ముందుకువచ్చి, వారు కూడా విక్రముడి కత్తికి బలి అయినారు. మిగిలినవారు బెదరి వెనక్కు తిరిగి పోయినారు.

ఈ వార్త వినగానే రాజమార్తాండుడు నిర్ఘాంతపోయినాడు. వంతెనమీద రహస్యంగా దాగి తన సైనికులను పొట్టబెట్టుకొంటున్న యోధుల ఆటకట్టించడానికి అతను ఎన్నో ఉపాయాలు ఆలోచించాడు. అతని ఆజ్ఞానుసారం, నది ఈదడానికీ, చిన్నచిన్న తెప్పలమీద నది



దాటడానికీ చాలామంది సైనికులు యత్నించారు. కాని సగం దారిలో ఉండగానే అవతలిగట్టున వుండే చెట్ల చాటునుండీ, పొదల చాటునుండీ బాణాలు వచ్చి వారిని నదికి బలియిచ్చాయి.

వంతెనను రక్షించే యోధుల పరిస్థితి కూడా ఏమంత క్షేమంగా లేదు. ఎందుచేతనంటే, రాజమార్తాండుని సైనికులు చనిపోయినవారి శవాలను అడ్డం పెట్టుకోవడంతో యోధుల కత్తివేట్లు తప్పించుకొని, వంతెనమీద కొంతదూరం ముందుకు పోగలిగారు. స్తంభాలమాటున వున్న యోధులలో కొందరిని మట్టుకు దెబ్బతీయగలిగారు.



రాజమార్తాండుని సైనికులు ప్రాణాలను లక్ష్యపెట్టక ధైర్యంగా ముందుకు ఉరికినట్టయితే వంతెన వారివశం కాక తప్పదని విక్రముడు గ్రహించాడు. రాజమార్తాండుడు తన సైనికుల ప్రాణాలను లక్ష్యపెట్టేటట్టులేదు.

గండ్రగొడ్డళ్ళతో వెనుకనుంచి వంతెనను పడగొట్టుకురమ్మనీ, వంతెన పడిపోయేటప్పుడు వెనుకవారిని వెనుకనుంచే వెళ్ళిపొమ్మనీ విక్రముడు తన అనుచరులకు ఆజ్ఞయిచ్చాడు. విక్రముడు తప్ప మిగిలిన వారంతా వంతెనను ధ్వంసం చేస్తూ, తీరా అది విరిగిపడే సమయానికి అవతలి ఒడ్డుకు చేరుకోసాగారు. కొద్ది సేపట్లో నే దాదాపు వంతెన అంతా విరిగిపడి నర్మదలో కొట్టుకుపోయింది.

విక్రముడు తప్ప మిగిలినవారంతా అవలి ఒడ్డుకు చేరుకున్నారు. రాజమార్తాండుడి భటులు విక్రముణ్ణి ప్రాణాలతో పట్టుకున్నారు. ఖైదీల శిబిరానికి పట్టుకుపోయారు.

ఆరాత్రి రాజమార్తాండుడూ, ముఖ్యులైన అతని అనుచరులూ గుడారాల మధ్య చలిమంటచుట్టూ కూర్చుండి మాట్లాడుకుంటూ వుండగా అక్కడికి భటులు విక్రముణ్ణి పెడరెక్కలు విరిచికట్టి తెచ్చారు.

ఆ మంటల కాంతిలో విక్రముడి అవతారం దేదీప్యమానంగా కనిపించింది.

"నేను పిరికిపందను కాను. పారిపోను. నన్ను పెడరెక్కలు విరిచికట్టనవరం లేదు. నా చేతులు వదిలించండి," అన్నాడు విక్రముడు.

"స్తంభంచాటున వుండి సైనికులను సంహరించిన నీవు శూరుడివీ, ధీరుడివీ ఎట్లా అవుతావు?" అన్నాడు రాజమార్తాండుడు పళ్ళు కొరుకుతూ.

"అధర్మయుద్ధానికి నియమాలేమిటి?" అన్నాడు విక్రముడు.

"నాదా అధర్మయుద్ధం?" అని అడిగాడు రాజమార్తాండుడు.

"అవును! ముమ్మాటికీ. మీరు మామీద యుద్ధం ప్రకటించలేదుగా?"

"అరాజకదేశంమీద యుద్ధం ప్రకటించేదేమిటి?"

"మా దేశానికి ప్రజలే రాజులు. మాది ప్రజారాజ్యం."

"ప్రజారాజ్యం ఒక రాజ్యంకాదు. అది నిలబడదు."

"మేము మా రాజ్యాన్ని నిలబెట్టుకుంటాము. నా చేతులు విప్పించండి. నేను మీతో మాట్లాడాలి," అన్నాడు విక్రముడు.

రాజమార్తాండుడు అతని చేతులు విప్పించి, తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

"నేను మీ దేశంలోని ప్రజలను క్షణంలో నాశనం చేస్తాను. నీవంటి పిరికిపందలు నాకు లక్ష్యంలేదు. మీకొక రాజు ఏర్పడేదాకా మీదొక రాజ్యమని నేను గుర్తించను," అన్నాడు రాజమార్తాండుడు.

"మాదేశంలో నావంటి యువకులూ, నన్ను మించినవారూ ఎంతోమంది ఉన్నారు. వారు మా రాజ్యాన్ని తమ ప్రాణాలతో కాపాడుతారు. వారి సాహసం ఎటువంటిదో మీకు మచ్చు చూపిస్తాను," అంటూ విక్రముడు తన ఎడమచేతిని గభీమని మంటలలోకి చాచాడు.

క్షణంలో అతని చెయ్యి కాలసాగింది. అయినా, విక్రముడు తనచేతిని వెనక్కు తీయలేదు. కాలుతూన్న చేతికేసి చూస్తూ విక్రముడు ఇలా అన్నాడు:

"మేము సాహసులం. చిత్రహింసలు చేసినా మీరు మమ్మల్ని జయించలేరు. మేము మా ప్రజారాజ్యాన్ని కాపాడడానికి ఎంత త్యాగమైనా చేస్తాం!"

విక్రముడి సాహసానికీ, నిశ్చలత్వానికీ రాజమార్తాండుడు చాలా అచ్చెరువందాడు. వెంటనే విక్రముణ్ణి విడిచిపుచ్చి రాజమార్తాండుడు మరునాడే గుడారాలెత్తి తన సేనలతో సహా రాజధానికి మరలిపోయాడు.





# మంత్రినీతి

ఒకానొకప్పుడు మగధదేశాన్ని చంద్రసేనుడనే రాజు పాలించేవాడు. ఆయనకు నలుగురు కొడుకులు. గురుకులంలో వాళ్ళు అన్ని విద్యలూ క్షుణ్ణంగా నేర్చుకుని వచ్చాక, రాజు వాళ్ళను మంత్రివద్దకు వెళ్ళి ఒక సంవత్సరంపాటు రాజనీతి గురించి కూలంకషంగా నేర్చుకు రమ్మన్నాడు.

ఇది తెలిసి మంత్రి, చంద్రసేనుణ్ణి కలుసుకుని, "ప్రభూ, అన్ని విద్యలూ గురుకులంలో నేర్చుకున్నాక ఇంకా తెలుసుకోవలసిన రాజనీతి వుంటే, అది యువరాజులకు మీరు నేర్పాలి. రాజవంశీకులకు తగిన సలహాలు ఇవ్వడమే తప్ప, విద్యనేర్పడం మగధమంత్రుల సంప్రదాయం కాదు," అని చెప్పాడు.

దీనికి చంద్రసేనుడు నవ్వి, "మంత్రివర్యా, రాజనీతి గురించి మీకు తెలిసిన దాంట్లో ఎన్నోవంతు నాకు తెలుసు? ఎన్నో పర్యాయాలు మీ చతురోపాయాల కారణంగా జటిలసమస్యలు పరిష్కారమయ్యాయి. యువరాజులకు రాజనీతి బోధించడానికి, నాకంటే మీరే అర్హులు," అన్నాడు.

రాజుకు తన మీద వున్న సదభిప్రాయానికి మంత్రి ఎంతో సంతోషించాడు. అయినప్పటికీ ఆయన యువరాజులకు విద్యాబోధన చేయడానికి అంగీకరించక, "ప్రభూ, రాజనీతి బోధనతో నేర్చుకునేది కాదు. నేర్చిన విద్యలను అవసరానికి తగినవిధంగా ఉపయోగించుకోవడానికి, చాలా అనుభవం కూడా అవసరం. రాజనీతి గురించి రాజకుమారుల సమయం వృథా చేయకండి. వారికి అన్నివిధాలా నా కుమారుడు సహకరించగలడు," అన్నాడు.

"వసుంధర"

అప్పుడు చంద్రసేనుడు, మంత్రితో, "అసలు విషయం చెబుతున్నాను! రాజ కుమారులను మీరు శ్రద్ధగా గమనించి, వారిలో సింహాసనానికి అర్హులెవరో నిర్ణయించాలి. అందుకే రాజనీతి వంకతో వారిని మీ వద్దకు పంపుతున్నాను," అన్నాడు.

"మహాప్రభూ, రాజకుమారులలో పెద్ద వాడైన ధర్మసేనుడు రాజు కావడం మన దేశ సంప్రదాయం. సంప్రదాయం తప్పడం తమకు ఉచితం కాదు," అన్నాడు మంత్రి.

రాజు ఒక క్షణం ఆలోచించి, "సంప్ర దాయం పేరిట అర్హతను నిర్లక్ష్యం చేయడం నాకు నచ్చదు. తరతరాలుగా మా ఇంట ఒకే మగబిడ్డ గలుగుతూండడంవల్ల, ఇంతవరకూ మా పూర్వీకులెవరికీ, నా కొచ్చిన సమస్య రాలేదు. నలుగురిలో ఎవరికి రాజ్యార్హత వుంటే, వారికే రాజ్యం కట్టబెట్టి ప్రజలకు మేలు చేయాలని నా సంకల్పం. దీన్ని మీరు కాదనకూడదు," అన్నాడు.

మంత్రి దీనికి సమాధానం ఇవ్వక నవ్వి ఊరుకున్నాడు.

చంద్రసేనుడు సంతృప్తిపడక, "మీరెందుకు నవ్వారో కారణం చెప్పాలి!" అన్నాడు.



"ప్రభూ, మీ మాటలు నాకు అసం దర్భంగా తోచినప్పుడు, నాకు నవ్వు వస్తూంటుంది. తమరు నొక్కించి కారణ మడగరాదు. అందువల్ల మీ మనసు నొచ్చుకుంటుంది. అది నాకిష్టముండదు," అన్నాడు మంత్రి.

అయినప్పటికీ చంద్రసేనుడు, మంత్రి నవ్వుకు కారణం చెప్పాలని పట్టుపట్టాడు. చివరకు విధిలేక, "ప్రభూ, యువరాజు ధర్మసేనుడు, నా కుమార్తె త్రిపుర సుందరిని ప్రేమించాడు. రూపగుణ లావణ్యాలలో నా కుమార్తెకు ఏ దేశపు రాకుమారీ సాటిరాదు. కానీ తమరు రాకుమారినే తప్ప, మంత్రికుమార్తెను



కోడలుగా స్వీకరించరని ధర్మసేనుడు నమ్ముతున్నాడు. తమరు సంప్రదాయాన్ని వదిలి అర్హతనుబట్టి నా కుమార్తెను, మీ కోడలుగా స్వీకరించగలరా ?'' అని అడిగాడు మంత్రి.

ఈ మాటలతో చంద్రసేనుడికి కోపం వచ్చింది. ఆయన దాన్ని అణచుకునేందుకు ప్రయత్నిస్తూ, "మీ కుమార్తె అర్హతను నిర్ణయించవలసింది, మీరు కాదు; నేను!'' అన్నాడు.

దీనికి మంత్రి మళ్ళీ నవ్వి ఊరుకున్నాడు. కారణం చెప్పమని రాజు మరీ మరీ బలవంతపెట్టగా, ''ప్రభూ, తనకే స్త్రీ భార్యకావాలో నిర్ణయించే స్వతంత్రం పురుషుడికుండాలి. ధర్మసేనుడు త్రిపుర సుందరిని తన భార్య కావాలనుకుంటున్నాడు. అది కాదనే అర్హత మీకంటే నాకే ఎక్కువ. ఎందుకంటే రాజకుమారులలో రాజు కాగల అర్హత ఎవరికున్నదో తేల్చలేక, తమరా బాధ్యతను నాకప్పగిస్తున్నారు. రాజును నిర్ణయించగలవాడికి రాణిని నిర్ణయించగల అర్హత వుండదంటారా ?'' అన్నాడు మంత్రి.

చంద్రసేనుడు కాసేపాలోచించి, ''మీరు చెప్పింది సబబుగానే వున్నది. ధర్మసేనుడు, త్రిపురసుందరిని ప్రేమించి వుంటే వారి వివాహం నేనే జరిపిస్తాను. తమరిక ఏ సందేహమూ లేకుండా రాజకుమారులలో రాజ్యార్హత ఎవరికున్నదో నిర్ణయించే ప్రయత్నానికి పూనుకోండి,'' అన్నాడు.

దీనికి కూడా మంత్రి నవ్వి ఊరుకున్నాడు.

''ఇప్పటికీ మీకు నా చిత్తశుద్ధి మీద నమ్మకం కుదరలేదా ? ఎందుకలా నవ్వుతారు ?'' అని అడిగాడు రాజు చంద్రసేనుడు.

''ప్రభూ, ధర్మసేనుడు నా అల్లుడయ్యాక, రాజ్యార్హత వేరే ఎవరికో ఉన్నదని నేను నిర్ణయిస్తానని మీరు నమ్ముతున్నారా ?'' అన్నాడు మంత్రి.

''మీ నిస్వార్ధబుద్ధిని నేనెప్పుడూ గౌర వించి నమ్ముతాను. మీమీద నాకెలాంటి అనుమానమూ రాదు,'' అన్నాడు చంద్రసేనుడు.

''అయితే, నా నిర్ణయం చెబుతాను వినండి! ధర్మసేనుడు నా కుమార్తెను చాలాకాలంగా ప్రేమిస్తున్నాడు. అందుకని నేనూ అతణ్ణి చాలాకాలంగా శ్రద్ధగా గమని స్తున్నాను. రాజకుమారులు నలుగురిలో రాజ్యార్హత అతడికే ఉన్నదని నిర్ణయిం చాకనే, నేను వారి వివాహ ప్రసక్తి ఈరోజు మీదగ్గిర తీసుకువచ్చాను,'' అన్నాడు మంత్రి.

చంద్రసేనుడు తెల్లబోయి, ''తమరిలా పక్షపాత బుద్ధితో వ్యవహరిస్తారని నేననుకో లేదు. మీ స్వార్థంకోసం నా ఆదర్శాన్ని దెబ్బతీశారు,'' అన్నాడు.

దీనికి మంత్రి మళ్ళీ నవ్వి ఊరు కున్నాడు.

రాజుకు ఉక్రోషం వచ్చి, ''మాటి మాటికీ మీరలానవ్వడం, నాకు ఏమాత్రం నచ్చలేదు. ఆలస్యం చేయకుండా మీ మనసులో ఏమున్నదో వెంటనే చెప్పండి,'' అని అడిగాడు.

''ప్రభూ, మీ ఆదర్శమేమిటో, నాకర్థం కావడంలేదు. అర్హుడికే రాజ్యాభిషేకం చేయాలంటే, అందుకు రాజకుమారులు నలుగురినే ఎందుకు పరీక్షించాలి? దేశంలో సమర్థులకు కొదవయిందా? మీ బిడ్డలలో ఒకరికి మాత్రమే రాజ్యమివ్వా



లన్న సంప్రదాయం పాటిస్తూనే, మీరు సంప్రదాయం పాటించని ఆదర్శవాదినను కుంటున్నారు. మీరు మీ బిడ్డలలో ఒకరు రాజు కావాలనుకున్నట్లే, నేను నా అల్లుడే రాజు కావాలనుకుంటే తప్పుపడుతున్నారు. నవ్వుకోక నేను చేయగలిగినదేముంది?'' అన్నాడు మంత్రి.

రాజుకు తన ఆలోచనలోని లోపం ఇప్పుడు అర్థమైంది. ఆయన సంప్రదాయాన్ని విడిచిపెట్టే ఆలోచన మానుకుని, ''ధర్మసేనుడికి నిజంగానే రాజ్యార్హత ఉన్నదని తమరు భావిస్తున్నారా?'' అని ప్రశ్నించాడు.

''ప్రభూ, సమర్థుడైన మంత్రి, శక్తిమంతులైన పరివారం, నమ్మకస్థులైన సేవకులు, అనుకూలవతి అయిన భార్య, అభిమానించే ప్రజలు వుంటే, ఏ రాజైనా రాజ్యాన్నేలడానికి అర్హుడే! అందులోనూ సంప్రదాయం ప్రకారం ధర్మసేనుడే రాజ్యార్హత కలిగినవాడు,'' అన్నాడు మంత్రి.

చంద్రసేనుడు మారుమాట్లాడకుండా మంత్రి చెప్పినదానికి అంగీకరించాడు. అప్పుడు మంత్రి నవ్వి, ''ఎందుకు నవ్వావని అడక్కండి! మీకు వియ్యంకుడిని కాబోయే నేను, మీరంటే భయపడ నవసరంలేదు. రాజొక్కడు స్వార్థపరుడైతేనే రాజరికం రాజాంతఃపురం విడిచి పోవడంలేదు. ఇప్పుడు రాజు, మంత్రుల స్వార్థం కలిస్తే పూర్వీకులేర్పరచిన మగధ సంప్రదాయాలు చిరస్థాయిగా నిలిచి పోతాయి,'' అన్నాడు.

దీనికి చంద్రసేనుడు కూడా నవ్వి, ''రాజనీతికంటే, మంత్రినీతి గొప్పదని తమరు చక్కగా ఋజువుచేశారు. రాజనీతి నా బిడ్డను రాజును చేస్తే, మంత్రినీతి మీ బిడ్డను ఈ రాజ్యానికి రాణిని చేస్తున్నది. మీవంటి సర్వ సమర్థుడి అల్లుడైన ధర్మసేనుడికి, రాజ్యంలో ఎదురుంటుందనుకోను,'' అని వెంటనే ధర్మసేనుడి వివాహానికీ, రాజ్యాభిషేకానికీ ఏర్పాట్లు చేశాడు.



## తేనెటీగల కృషి!

ఒక పౌండు తేనె తయారుచేయడానికి, తేనెటీగలు దాదాపు 40 లక్షల పువ్వుల నుంచి మకరందం సేకరిస్తాయి.



## తల్లకిందులుగా ఈదే చేప

ఆఫ్రికాలోని క్యాట్ ఫిష్ (సినొడోన్టిస్ బాటన్‌సొడా), తల్లకిందులుగా ఈదుతుంది. ఇలా ఈదడంవల్ల నీటి ఉపరితలంలోని ఆహారాన్ని సులభంగా పట్టుకోగలుగుతుంది.

## పొడవాటి చెవులు!

మామూలు కుందేళ్ళకన్నా, ఎడారి కుందేళ్ళ చెవులు పొడవుగా వుంటాయి. ఈ పెద్దచెవులలో రక్తనాళాలు ఎక్కువగా వుండడం వల్ల, వీటి శరీరం చల్లగా వుండడానికి దోహదం చేస్తాయి.






1975
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

వనిత

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది?

వనిత

* మరి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

వనిత

1989
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదిహేనవ
సంవత్సరం....

కారణం

● విజ్ఞానానికి ● వికాసానికి ● వినోదానికి

వనిత




చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 మే నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan


M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: సంతోషానికి సంగీతం! రెండవ ఫోటో: జీవనోపాధికి ఆధారం!!

పంపినవారు: అల్లాడి శారదాకుమార్, బాగ్ అంబర్ పేట, హైదరాబాదు-13.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | |
|---|---|
| *1. Place of Publication* | 'CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *2. Periodicity of Publication* | MONTHLY<br>1st of each calendar month |
| *3. Printer's Name* | B.V. REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *4. Publisher's Name* | B. VISWANATHA REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Chandamama Publications<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *5. Editor's Name* | B. NAGI REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | 'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *6. Name and Address of individuals who own the paper* | CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS:<br>1. Sri B. VENKATRAMA REDDY<br>2. Sri B.V. NARESH REDDY<br>3. Sri B.V. SANJAY REDDY<br>4. Sri B.V. SHARATH REDDY<br>5. Smt. B. PADMAVATHI<br>6. Sri B.N. RAJESH REDDY<br>7. Smt. B. VASUNDHARA<br>8. Kum.B.L. ARCHANA (Minor)<br>9. Kum.B.L. ARADHANA (Minor)<br>(Minors admitted to the benefits of Partnership)<br><br>'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March 1990*

THE MOST ENDEARING GIFT YOU CAN THINK OF
FOR YOUR NEAR AND DEAR WHO IS FAR AWAY

# CHANDAMAMA



**Give him the magazine in the language of his choice—**
Assamese, Bengali, English, Gujarati, Hindi, Kannada,
Malayalam, Marathi, Oriya, Sanskrit, Tamil or Telugu
**—and let him enjoy the warmth of home away from home.**

**Subscription Rates (Yearly)**

**AUSTRALIA, JAPAN, MALAYSIA & SRI LANKA**

By Sea mail Rs. 81.00    By Air mail Rs. 156.00

**FRANCE, SINGAPORE, U.K., U.S.A.,**
**WEST GERMANY & OTHER COUNTRIES**

By Sea mail Rs. 87.00    By Air mail Rs. 156.00

**Send your remittance by Demand Draft or Money Order favouring**
**'Chandamama Publications' to:**

CIRCULATION MANAGER **CHANDAMAMA PUBLICATIONS** CHANDAMAMA BUILDINGS
VADAPALANI MADRAS 600 026